# పీఠిక

శ్లో॥ శ్రీమత్సుధార్ణవే రత్నద్వీపే మాణిక్యమందిరే
రత్నసింహాసనాసీనాం హ్యాదికామేశ్వరీంభజే.

మచ్ఛ్రేయోభిలాషులకోరికపై నీబృందావనమను పేరట నావిరచితములనుండికొన్ని గుచ్ఛముల గూర్చియున్నాను. ఇందు "ప్రణయలీల"లో మొదటిపద్యమును తుదిద్విపదలో నొక కొంచెమును మాత్రము "రుబాయతు" లోని భావము. పత్రికాదుల ననుసరించి వ్రాయబడినవి చాటువులు. అక్కడక్కడ గొన్నిపదములు జనులవాడుకనుబట్టి ప్రయోగింపఁ బడినవి.

ఇట్లు
తిరుపతివేంకటేశ్వర శిష్యపరమాణువు
మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి

శ్రీ వేంకటేశ్వరాయనమః

మద్గురుతుల్యులును ప్రాణదాతలునగు

# బ్రహ్మశ్రీ గోవిందరాజు వేంకటసుబ్బారావుగారి

## ఆశీర్వచనము

---

దీర్ఘాయురారోగ్యైశ్వర్యశాంతిపథముల నీరచయితకును తత్సంతానమునకును ప్రసాదించుటకునై మత్స్వామి వేంకటేశ్వరుని భాసములకు నివాలించుచున్నాను.

గోవిందరాజు వేంకటసుబ్బారావు

# అభిప్రాయములు

శ్రీమత్పరదేవతాయైనమః.

కడియము

తూ. గో. జి.

20—11—37.

## బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

## బృందావనము

అనెడి యీఖండకావ్యములసంపుటము చి. మాధవ పెద్ది బుచ్చిసుందరరామయ్యచే రచింపఁబడినది. ఇతఁడు సుమారు ఇరువదియైదేళ్లకు పూర్వము నాయొద్దకొన్నాళ్లు మాఘకావ్యమును కౌముదియుఁ జదువుకొనుటకు వచ్చినాఁడు. మాదంపతులయందు కేవలము కన్నతల్లిదండ్రులకన్నను అధిక భక్తిగానుండి చదివికొన్నాఁడు. కాని అతనికితోఁచినట్లు చదువుటయేకాని నాయేర్పాటునుబట్టి చదువువాఁడుకాఁడు. ఇతని కప్పటికే తెలుఁగులో మంచి కవితాధారయుండెడిది. ఎట్లో కొంత కౌముదియు మాఘములో కొంతవఱకును నెఱవేర్చి నాఁడు. ఇతనిచదువు గానముతో మిళితముగనేయుండును గాని నాకు రేగుప్తివలెనే యితనికి నాదనామక్రియ అనెడి రాగము మీఁద నభిమానమెక్కువ. ఆకారణమువలన నాకు శిష్యుఁడై

కూడ నాచదువుధోరణి యితరశిష్యులతోపాటుగానీతఁ డను
కరించువాఁడు కాఁడు. ఇతనిచదువుఫక్కి మిక్కిలి శ్రావ్యముగా
నుండును. కవిత్వము కేవలము క్రొత్తపోకడలతో నెంతో
రుచ్యముగానుండును. ఒకరిత్రోవకు బొత్తిగా లేఖినిని నడుపని
వాఁడగుటచే నీతనికవితకు గ్రంథచౌర్యదోషము లేశమును
తగులదు. ప్రస్తుతమాంధ్రభాషలోఁ జేరి వాడఁబడుచున్న హూణ
భాషాపదము లితనికవిత్వములో నెన్నో యుండును. పూర్వ
కవులందఱును వారివారికాలమునకు వాడుకలోనున్న ఆయా
యితరభాషాపదములను అంతో యింతో గ్రహించినవారే. ఈ
పుస్తకము విద్యార్థులకు పఠనీయముగా విద్యాశాఖాధికారులు
తప్పక చేకొందురని నాదృఢవిశ్వాసము. ఒకరిసిఫారసుతో దీని
కవసరముండదు. ఈకవిత్వసారస్యమట్టిది. తన్మయత్వముసర్వత్ర
కవికి స్ఫురించుచుండును. భగవంతుఁడితనికిఁ జిరాయురారోగ్యై
శ్వర్యములననుగ్రహించునట్లు లాశీర్వదించుచుదీనినిముగింతును.

చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రి,

శతావధాని.

శ్రీరస్తు

శ్రీమన్మహా మహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిసార్వభౌమ
ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథాది బిరుదాంకితులగు
బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు రచించిన "బృందావన"మను ఖండకావ్యములోఁ గొన్ని పద్యములు కవిగారే శ్రావ్యముగాఁ జదివి వినిపించినారు. నాకాపద్యములు హృద్యములై శ్రవణానందము గలిగించినవి. చక్కని మృదుపదములతో మధురమధురముగా నాపద్యములు చెవులంబడి యెట్టివారి మనంబులనైన గఱఁగింపఁగలవని నా నమ్మకము. "ఆలోచనామృత"మను నా నుడిన్వీడనాడి "ఆపాతమధుర" మను గీతార్థమును బొందుచున్నవని త్రికరణశుద్ధిగాఁ జెప్పఁగలను. ఇప్పటివారు వ్రాయు ఖండకావ్యములకన్న వీరి యీ ఖండకావ్యము వేయిరెట్లతిశయించుచున్నదని నా యభిప్రాయము. వీరు చిరాయురారోగ్యములుగలిగి యిట్టు లెన్నో కావ్యములువ్రాసి లోకము నానందింపఁజేయుదురుగాక యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

రాజమండ్రి,
20—11—37

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

## చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

శ్రీవేదమూర్తులైన బ్రహ్మశ్రీ మాధవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రిగారు రచించిన "శారద, సతీస్మృతి" మొదలగు గ్రంథములలో పద్యములను మఱికొన్ని చాటుధారాపద్యములను నేటియుదయమున వారు చదువగ విని పరమానందము నొందితిని. కవనము ద్రాక్షాపాకమై ధారాశుద్ధిగల్గి ప్రసాద గుణముగల్గి హృదయంగమముగనున్నది. ప్రతిపద్యము రసాస్పదము. ప్రతిభావము గంభీరము. ప్రతికల్పనము మనోహరము. పరమేశ్వరుడు వీరికి దీర్ఘాయురారోగ్యములిచ్చి సారస్వతసేవ చేయించుగాక!

రాజమహేంద్రవరము, 21—11—37. } చిలకమర్తి లక్ష్మీనరసింహము

శ్రీ పరదేవతాయైనమః

# బృందావనము

## ప్రార్థనము

మ. పరిమాణింప నశక్యమైనది భవత్ప్రాబల్య మీవిశ్వగో
చరమే కాని వమోఘమైనవి భవత్సంకల్పముల్, ప్రేమలోఁ
జరమస్థాన మలంకరించినది నీసత్యస్వరూపంబు, మే
మెఱుఁగంజాలుదుమే! భవన్మహిమ తండ్రీ, ఆర్తరక్షామణీ!

మ. అదిగో! అప్పటియాదికాలమున నీవాహానిరాణ్మండలీ
హృదయాస్థానమలంకరించి ప్రతితంత్రీసూక్ష్మసూక్ష్మాణువున్
గదలన్ మాటి కొనర్చినాఁడవట వీణాబ్రహ్మగానంబు మా
కెదియేదీ యొకసారి చూపగదె తండ్రీ, దానిమాధుర్యమున్.

శా. ఆవీణాస్వరమాధురిం దవిలి దివ్యాబ్దంబు లెన్నేని తా
మీవిశ్వంబు సమస్తమున్ మఱచి యందే లీనులైనట్లు మా
కే వేదంబు వచించు నయ్యదియు నీవే కావె, ఏలయ్య మా
కీవా భాగ్యము వారె నీకైనవారే! మేము కామైతిమే!

మ. తనయుచ్ఛ్వాసమె హంసలాగు హృదయస్థానంబునన్
నిల్చి య
ల్లన జోకొట్టుచు నిద్రఁబుచ్చునటు లాలాపించు సంగీతని
స్వనమాధుర్యము గ్రోలి కేవలము జీవన్ముక్తుడై పోక యెం
దునకో మానవుడూరకే గడపుచుండున్ గాల మాత్మేశ్వరా!

మ. నరుఁ డొక్కింత మనంబు నిల్పి తనకంటన్ బాపకున్ మధ్య ని
వ్వరిముల్లంతటి సూక్ష్మరంధ్రమున నాపోజ్యోతివై
యున్న నిన్
బరమాత్మున్ గనలేక శుక్తిరజతభ్రాంతిప్రవిష్టాత్ముఁడై
యురకే గ్రంథము గ్రంథమున్ బెరుగవేయున్ దండ్రి
విశ్వేశ్వరా !

మ. నిరహంకారము, నిర్మమత్వమును, తండ్రీ, నిత్యనైమిత్తికా
చరణస్ఫూర్తియు, శాంతి దాంతియు, యదృచ్ఛాలాభ
సంతుష్టి, నీ
చరణధ్యాన సమాధు, లన్న వెకదా! 'సత్యం శివం సుందరం
పరమం' బైన భవత్పదంబునకు సోపానంబు లాత్మేశ్వరా!

మ. తమయందుండినయట్టి యష్టదళపద్మం బష్టభార్యాసమూ
హముగా నిన్ బరమాత్ముఁ గృష్ణునిగ దేహద్వారకన్ నారదా
ది మహర్షుల్ మును నిర్వికల్పకసమాధిన్ గేళిగావించి ని
త్యమునుం జెందరె యద్వితీయమగు నాత్మానంద మాత్మేశ్వరా!

మ. నిరతంబున్ దనలోపలం గలత్రివేణీ సంగమంబందునం
బరమస్నాన మొనర్చి భక్తి మదిరాపానంబు గావించి యాం
తరహంసాత్మకమైన నీప్రణవనాదబ్రహ్మముం జెంది, మా
యురె, మా నారదుఁ డెంతముగ్ధుఁ డయినాఁడో నాఁడు
విశ్వేశ్వరా !

మ. కలకాలంబును కాపురంబునకు సౌఖ్యస్వర్గ మాహార మ
స్ఖలితానందరసంబు, క్రుమ్మఱుఁ జిదాకాశం బధిష్ఠింపఁ గుం

జలినీచక్రసువర్ణపుష్పకవిమానం బెంత ధన్యాత్ములో!
అల యింద్రాదిసురల్ మహామహులు నీ యాత్మీయు
లాత్మేశ్వరా !

తే. గీ. వచ్చి యొకసారి నా ప్రాణవాయువునను
హృదయవేణువు నూదిపోయెదవె కృష్ణ !
ఆత్మబృందావనంబు నీయాగమమున
కెదురెదురు చూచుచున్నదోయీ, మహాత్మ !

తే. గీ. యమునయే గాక దేహప్రయాగయందు
గంగయు సరస్వతియుఁ గూడఁ గలవుగాన
నా త్రివేణీ జలక్రీడ నాచరింతె ?
నాడికారూప గోపీజనంబు గూడి.

తే. గీ. బాలకృష్ణుఁడవై నాదు ప్రకృతి శ్రుతిని
వేణుగానంబు నేకీభవింపఁజేయు
మనుసరించు మృదంగ మన్నటు త్రివేణి
ఘుమఘుమార్భటి శబ్దంబు గొలుపుకొనుచు.

'శారద' నుండి

## శారద వనవిహారము

చ. అదియొకపూలతోఁట సమయంబరుణోదయ మల్లమల్లెపూఁ
బొదకడఁ బైడిగుమ్మటము వోల్కి నిలంబడి యల్లనల్లనన్
గదలుచుఁ బువ్వు పువ్వు రవగాలికి మోహనృత్యమాడు నో
ప్పిదమునుగాంచు కన్నదెస వేయుదమించుక సేపుమాపులన్.

చ. అరయుచుఁ బాలయుందము నొయారముగా నట చంద
మామతో
దొరసెడు వెన్నొసంటఁబడు తుమ్మెదఱెక్కలవంటి లేఁతము
గురులెగ నెత్తికొంచుఁ గొనగోళుల ముద్దులు మూటగట్టు న
చ్చెఱుతుక పేరుదాల్చి విలసిల్లును శారదయన్ సువర్ణముల్

చ. మడచినపుస్తకంబువలె మాపుల సెజ్జపయిన్ బరుండి క
న్మొడుచు నలంగునో నవయునో జడపూవులటంచు వాడుచూ
పెడుపువుకంటఁబడ్డఁ గడుబెగ్గిలి బిక్కమొగంబు వైచు న
ల్లెడఁగను నామెపూవు లోకమెత్తుగఁ బ్రాణము లొక్క
మెత్తుగన్

చ. అఱవిరి మోజు, విచ్చిసొగసౌనును ఱెక్కలతోడనూగు క్రొ
వ్విరి నతితృష్ణ, దానఁ బ్రభవించి గుబుల్కొను తావిఠీవిపై
మరులుగదించి లోకము సమస్తము పుష్పము యుంబెయైన సుం
దరమయి యొంతయొప్పునో గదా, యని యామెదలంచు
మాటికిన్.

చ. విరిసినపువ్వుపువ్వునను వెల్గుచు మానసముఁ గరంచు నీ
శ్వరకళ నుప్పతిల్లెడు ప్రసన్నత కెంతయు మోహముగ్ధయై
మఱిమఱిఁ జూచిచూచి కనుమ్రాన్పడి యొక్కొకవేళఁ
దన్నుఁదా
మఱచుచు మారుపల్కు దొకమాత్రముగా నెలుగెత్తి
పిల్చినన్.

చ. అదిగో! లతావితానముల కావలఁ గమ్మని పూఁతపిందెలన్
విదిలెడి మావిఁజివి గమనింపుచు నొక్కలతాంగి రావె శా
రదయని పిల్చినంత మనరాజనిభానన వచ్చుచుంటి నే
నిదెయని సాగెదున్ మనము నేగుద మయ్యెడకున్ మనో
గతిన్.

చ. అలఁతిగ వంచి లేఁతనడు మంటియునంటనిరీతిఁ గోమలాం
ఘ్రుల నిలమోపుచున్ నడచు క్రొత్త యొయారముతోడఁ
బూవుదీ
వల ఫలవృక్షవాటికల పైనఁ గటాక్షసుధాతుషారమున్
జిలికెడు కన్నెచిన్నె దరిసించినఁ గన్నులపండువయ్యెడిన్.

మ. అలసాలోలసమీరలాలనల విప్పారంగనున్నట్టిమొ
గ్గలకుం దీయనితేనెబుగ్గలకు భృంగశ్రేణు లుత్కంఠతోఁ
గొలువుల్ దీర్చు లతాగృహంబునఁ జతుష్కోణాకృతిన్ వన్నె వ
న్నెలరాల్ మల్చి యమర్చినట్టి యొకతిన్నెన్ వార లాసీనలై.

చ. సురభిళమందమారుతకిశోరపరీతవనీలతాగృహాం
తరనవపల్లవస్థగితధాళధళీకశిలావితర్దికా

పరిసరనిస్వనత్ప్రమదబంభరకోకిలకీరశారికా
స్వరమధురామృతశ్రవణపారణసౌఖ్యరసైకలోలలై.

చ. పొడమెడుమొల్కలం గుఱించి పూచెడు వృక్షములన్ గుఱించి ప్రా
కెడుపలుతీవఁ గొన్నలఁ గెంజివురాకులగూర్చి ముచ్చటల్
నడపినమీఁదఁ గన్నె వదనంబునఁ జూడ్కి నిగుడ్చి యేదియో
నుడువగనుండె విందమలనూత్నవధూమణి వాక్యధోరణిన్.

చ. సిరిగలయింటఁబుట్టి యొకచిన్నము గష్టమనంగ నెట్టిదో
యెఱుఁగనిరీతి వర్ధిలునదృష్టముఁగూర్చుటెగాక దివ్యసుం
దరతరమైన యీయుపవనంబునుగూడ ననుగ్రహించె నీ
శ్వరుఁడు, సహోదరీ, పొగడశక్యమె, వాని దయాప్రపూర్ణతన్!

తే. గీ. సంస్కృతాంధ్రంబులను పరిశ్రమ మొకింత
సలిపియుంటివి గద ముఖస్థంబు లగునె
దైవపరమైనయట్టి పద్యము లెవేని
చదివెదే శారదా! రాగసరణి ననఁగ.

తే. గీ. చిఱునగవు వెన్నెలను మోవి చివురు సుంత
మిలమిలయనంగఁ గంఠంబు మేళవించి
ప్రకృతియనుశ్రుతి సంసిద్ధపడెఁ బఠింపఁ
గిమ్మనకయుండి మన మాలకింపవలయు.

శా. భక్తత్రాణపరాయణాయ భవతాపఘ్నాయ వేదత్రయీ
ముక్తాహారవిభూషితాయ కరుణాపూర్ణస్వరూపాయ దు

ర్వ్యక్తిచ్ఛేదకతారకప్రణవ పీఠారూఢతాభోగసం
యుక్తాధ్యాత్మికరాజ్యపాలనమహోద్యోగాయ
తుభ్యం నమః.

మ. పరిశుద్ధంబయి యద్వితీయమయి సర్వవ్యాప్తమై నిత్యమై
నిరవద్యంబయి నిర్వికారమయి మానిప్రాతచేతస్సరో
వరహంసంబయి కోటికోట్యరుణభాస్వద్దీప్తిధారావళీ
పరిపూర్ణంబు మహామహంబగు పరబ్రహ్మంబు మమ్మేలుతన్.

మ. యదుసింహంబు, యశోదపట్టి నవనీతాహారి కంసారి కెం
బెదవిన్ బిల్లనగ్రోవిఁ జేర్చి తులసీబృందావనక్షోణిలో
మృదుగీతామృతవర్షముం గురియు నా శ్రీకృష్ణమేఘుంబు నా
హృదయాకాశముఁ గ్రమ్మి శోక బహుళగ్రీష్మాతపం బార్చుతన్.

మ. కరుణాబ్ధీ! హృదయాబ్జపీఠమున నీకల్యాణరూపంబు సు
స్థిరముం జేసి తరింపఁగా నొకశుభాశీర్వాద మాసించి నీ
చరణప్రాంతమునన్ శిరంబునిచి తృష్ణావ్యాకులత్వంబులన్
బరిఘోషించెద నెట్లు తప్పుకొనిపోవన్ నేర్తువో చూచెదన్!

మ. శ్రమ లెన్నో విఫలంబులై చనియెనో స్వామీ!
మదీయ ప్రయ
త్నము లెల్లన్ ఫలియింపలేదు, జగదంతర్యామి! యీయొక్క జ
న్మమునం దీనరమాత్రజీవనములోనన్ మాటికిన్ సంభ్రమ
భ్రమలంగొల్పెడు నీరహస్యపృహాల పూర్ణత్వంబు సిద్ధించునే!

మ. నిరతంబున్ జిరనూతనుండవయి తండ్రీ! నీయెడన్ భక్తిబం
ధురులౌ వారి హృదంతరాళములయందున్ నూత్న
నూత్నంబుగాఁ

బరగఁ జేసి స్వయంప్రకాశత లయింపఁ జేసి యవ్వారలఁ
మరలఁ సృష్టియొనర్పవే! తిరిగి సంహారంబు గావింపఁగఁ.

మ. తెలుపఁ నేర్తునె యొక్క జీవనమునందే నన్నునీవెన్నిమా
ఱులు సృష్టించి లయింపఁ జేసితివొ కారుణ్యాంబుధీ! యింకఁగా
వలెనన్నఁ మఱియుఁ మఱేఁ మఱి లయింపంజేసి సృష్టించి కే
వలముఁ నీకనుసన్నలఁ మెలఁగుతేవఁ దిద్దుకొమ్మో ప్రభూ!

మ. సిరులుఁ లేములు కష్టముల్ సుఖములుఁ చింతల్
మహోత్సాహముల్
మరణంబుల్ జననంబులన్నియును యుష్మన్మంగళో
ద్దేశముఁ
నెఱవేర్పందగు సాధనంబులని మానింబోలి భావించు నే
పురుషుం డాతఁడె బంధముక్తుఁడు స్వయంభూ! నిర్వికార
ప్రభూ!

మ. పరిపాలించుచునుండు వెల్లపుడు యావద్విశ్వమీవిచ్చ ను
త్తరు వవ్యాహతరీతిఁ జెల్లెడి మహాత్మా! నీ శుభోద్దేశ మె
త్తెఱఁగో మేము గ్రహింపఁజాలక మహా ర్తిఁ
భ్రమగ్గుచున్నాము త
త్పరమార్థగ్రహణైక పాటవము మత్స్వామీ! కటాక్షింపుమీ!

సీ. పసిపాపయగువాని పాలబుగ్గలపైని
నివ్వటిల్లెడు మొల్కనవ్వుకన్న
అరుణోదయమున విప్పారి తుమ్మెదకాలు
మోపకుండినతమ్మిపూవుకన్న

ఉరుధాటినే తెంచు నోరుగాలికి నేని
కలఁగని మణిదీపకలికకన్న
ఆకైనసుంత యల్లాడకుండు నిశీథ
సమయమందలిసరోజలముకన్న

తే. గీ. నిర్మలముఁ గోమలంబును నిశ్చలంబు
శాంతిమయమైన యట్టి సుస్వాంతపీఠి
నమరునీకుఁ బ్రణామమియ్యదె యమేయ!
అద్వయ! అనంత! ఆదిమధ్యాంతరహిత!

తే. గీ. ఇపుడు మనమున్న యీలతాగృహసమీప
కదళికలమధ్యనున్న దల్లదిగో! చూడు,
శిల్పనైపుణితో వింత చెలువుతోడ
నత్మిసాఫల్యమిడుజాడ నలరుమేడ.

తే. గీ. ప్రాచ్యపాశ్చాత్యరచనల బహుళవర్ణ
సంకలనసామరస్యవిస్తరమనోజ్ఞ
కాంతిపూరంబుతోడ నాకాశవీధి
కెటుల నెమరెక్కెడినొ కంటివే! గృహంబు.

తే. గీ. తాదృశంబగు దివ్యసౌధంబునందు
ననుఁగుఁబ్రేయసితో జీవయాత్రనడపు
హాయిగా నొక్కరసభోగి యగ్రవర్ణ
నందనోద్యానభాగమందారశాఖి.

తే. గీ. పరులకన నొకదివ్యమందిరముగాని
యాతనికి భూతలస్వర్గ మాగృహంబు

మదిగఱంచెడు ప్రియసతీమధురమధుర
సరససల్లాపబహుళప్రసక్తికతన.

తే. గీ. వయసునలువదికొకవాసి, వాసి నేటి
తెలుఁగునాటికిఁ దళుకుము త్రెంపుఁబేరు,
పేరురఘునాథశాస్త్రి, తత్ప్రియతనూజ
లిచటిచిన్నారిపొన్నారియిగురుబోండ్లు.

చ. లలితసరోజరాజిసమలంకృతగాంగఝరీదరీపరీ
మళలహరీధురీణపవమానకిశోరవికీర్యమాణత
జ్జలకణరేఖికాగ్రహణసౌఖ్యరసాస్పదవాక్యచాతురీ
విలసితుఁడంచుఁ బండితులు వేయివిధంబుల మెత్తురాతనిన్

మ. అతిగంభీరమనస్వి, దేశహితచర్యాభ్యాసి, హూణాంధ్రసం
స్కృతసారజ్ఞుఁడు, నవ్యభారతవిపంచీలోకకల్యాణభా
షితతంత్రీపరిముక్తసార్వజనికస్వేచ్ఛారవామోది, త
త్ప్రతి సంపన్నగృహస్థు తత్ప్రతి స్వతంత్రవ్యక్తి లేఁడెందులన్

సీ. సతికి నాతనిపజ్జ జాజిపూవులసెజ్జ
అతిథికాతనిదృష్టి యమృతవృష్టి
సభకు నాతఁడొనర్చుచర్చ చందనచర్చ
శ్రోతకాతనిమాట సూటిబాట
నిఱుపేదపాలిపెన్నిధి వానిసన్నిధి
వాసికిందీవి యవ్వానియీవి
అనుయాయులకు వానియండ బంగరుకొండ
కలబంధులకు వాని కలిమి బలిమి

తే. గీ. నిరుపమస్నేహవాత్సల్యనిశ్చలత్వ
జీవకారుణ్యలావణ్యచిహ్నములకు
సతినివదనంబు సదనంబు సతత మతని
పూర్వభవసంచితాగణ్యపుణ్యమేమొ!

---

'శారద' నుండి

## శారదాకృష్ణుల యనురాగము

సీ. పవలనుమేడ రెండవమెట్టునను నిల్చి
లక్షించు నాతపలక్ష్మియనఁగ
చరియలోపలినుండి తెరలించుకొని పైకి
పారలెడుసెలయేటిపొంగనంగ
అతిశాంతమైనజీవితమునం దేలిపో
వని యొకానొకసుఖస్వప్నమనఁగ
అరయుచున్నకొలంది నతిశయిల్లుచుకాని
కడయేర్పడనిమహాకాంక్షయనఁగ
తే. గీ. కనులు మిఱుమిట్లుగొలుపుచు కడుఁబ్రసన్న
మగుచు 'మననీయమును' మనోహరమునైన
తనసతీయౌవనపుఁ దళ త్తళనతండు
కనుచుఁగనుచునె మోహముగ్ధతవహించు.
సీ. కడుఁజిన్నిపుష్యరాగపుఁ గట్టడపుదిద్దు
లన్ వ్రేలురవఁలోలకులతోడ
నెమలిపింఛంబువన్నియ పచ్చపొదిగిన
కడవ్రేలి ముద్దుటుంగరముతోడ

ఎడనెడఁగెంపు లెల్లెడనింద్రనీలంపు
మణులమర్చిన కంఠమాలతోడ
చిఱుతగజ్జెలమ్రోతఁ జెవికిఁబండువొనర్చు
మేలిబంగరు మొలనూలితోడ

తే. గీ. జాజిపూఁదీగెగాజుల జతలతోడ
రకరకపుఁ జీనిచీనాంబరములతోడ
ముగ్ధమోహనలావణ్యమూర్తితోడఁ
దేజరిలు వానిసతి రతిదేవిజాడ.

తే. గీ. కలకల౯ నవ్వునటులుండు కన్నులెత్తి
నిష్కలుషితాంతరంగంబు నీడఁజూపు
చూపను పవిత్రశీతలజ్యోతిఁ బఱపి
పాతకినిసైత మామె 'పునీతు'ఁజేయు.

తే. గీ. పలుకుపలుకునఁ బూఁదేనె చిలుకుమోవిఁ
బలువరుసముత్తెములకాంతిఁ బదిలపఱచి
తనప్రియుఁడు గన్నులం గప్పికొనఁగ నామె
ముచ్చటలనాడు ముద్దులుమూటగట్ట.

తే. గీ. అడుగిడినయప్పుడెల్ల జవ్వాడుచుండఁ
బిడికిట నడంగియడగని వేదనడుము
విభునికడ కామె యరుదెంచి వెడలుహొయలు
కనుటెపో కంటిలోఁ బాప గలఫలమ్ము.

తే. గీ. కొదమరాయంచనడలోని కులుకు, కన్నె
తరగనడలోని నిండునిబ్బరపుటొఱపు,

గువ్వనడలోని తీవి, యప్పావు బోడి
కదలినపుడెల్ల మనకు సాక్షాత్కరించు.

తే. గీ. సజలజలధరకోమలశ్యామసుంద
రంబులై మోముపై వ్రాలి రవ్వగాలిఁ
జెదరుచిన్నారి నొక్కులఁజిన్ని కురుల
దిద్దునపు డామె యొంతయు ముద్దుగురియు.

తే. గీ. పొన్న పువువన్నె లేఁయెండపాడఁ గపోల
దర్పణస్వేదబిందుముక్తాఫలంబు
లొప్పలొలుకంగ నామె యొక్కొక్క వేళ
నుపవనీసేవసల్పు నేత్రోత్సవముగ.

సీ. జలకమాడినపెన్నెఱులమీఁది తడియొత్తి
జడయల్ల కూరక జాఱవిడిచి
నిలువుపాపట నిల్పి నెలవంక యిరువంక
నలవిచ్చుపుష్పమంజరులమర్చి
జలతారుపూలతీవలజిల్గుపనిసేత
గల యాకుపచ్చని గౌనుదొడిగి
కుబుసంబువలె ముద్దుగొలుపు సన్ననియున్ని
వలువ నీటుగ వలెవాటు వేసి

తే. గీ. చిన్నినడుమున కటునిటు చివురుచేతు
లలఁతి యున్వెత్తు విలువంపుగలుగ మోపి
వడివడిగ నామె యొక్కొక్కయెడను వచ్చి
పలుకరించును పతిమేను పులకరింప.

సీ. కురులను దూమెఱుంగుగ దువ్వి జడయల్లి
కొనలయందున నూలుకుచ్చుగూర్చి
బొమలమధ్యను చుక్కబొట్టు నీటుగదిద్ది
చిటిపొటినగల నన్నిటిధరించి
లేయెఱ్ఱడాలుగల్గిన చిన్నిచిన్నిజ
ల్తారుమొగ్గల నీలిచీరగట్టి
అడుగులవెన్క జీరాడియాడనియట్లు
పసుపుపచ్చని మేలిముసుగువెట్టి

తే. గీ. ఎదుటికింబోయి విభుఁడు ప్రేమైకదృష్టి
నొరసి తనుజూచునపుడెల్ల నొదిగియొదిగి
యప్పుడపు డామె ముచ్చటలాడఁదొడఁగుఁ
జిన్నచిన్నల చిన్నారిచిలుకలాగు.

సీ. ఒక్కొకప్పుడు వ్రేలియుంగరంబుననున్న
పచ్చచాయకు దృష్టిబఱపుకొనుచు
మఱియొకప్పుడు కంఠమాలలోపలనున్న
నీలాలకెంపుల నిమురుకొనుచు
వేఱొకప్పుడు గులాబీపూవుమోవిపై
చిఱునవ్వు తొలుకాడఁ జేసికొనుచు
ఇంకొకప్పుడు ప్రక్క కించుకించుకగ జా
ఱెడుపయ్యెదను సవరించుకొనుచు

తే. గీ. అపుడపుడు పుష్పవనవిహారపుశ్రమంపుఁ
జెమటమొగ్గలఁ గొనగోర జిదిమికొనుచు

సారెకొకతీరు మధురశృంగారలీల
నెంతయు గఱంచుఁ దనజీవితేశు మనసు.

తే. గీ. జిలుగుఁ బయ్యెదచెఱఁగు కెంజేతి చివురు
వ్రేళుల విలాసముగ మెలివేసికొనుచుఁ
జిఱునగవుతోడఁ బతిమోము తెఱఁగుగనుచు
నొక్కొకపుడామె నర్మగర్భోక్తులాడు.

తే. గీ. చలువపావడదాల్చి, యీసరిగపూల
రైకధరియింపుమనియందురా? యటంచు
నడిగి, పతిమోవిగదలించునంతకామె
దవ్వనకునేగి ముసిముసి నవ్వునవ్వు.

తే. గీ. తీసి నగలెల్ల మెయిచాయ తెల్లపట్టు
చీరకుఁ మేల్మిబంగారునీరువోయ
విభునితో నామె యుపవనీవీధులందు
దిరుగునొయ్యారమును జూచితీరవలయు.

తే. గీ. పొడుపుకొండను బతినిల్వఁ బొంతనిల్చి
కురులతో నింద్రనీలాలగొడుగుపట్టి
మధురమధురంపుటూర్పుచామరమువీచి
నవ్యలావణ్యనీరాజనం బొనర్చు.

తే. గీ. చెంతఁబొంచున్న పతిరూపు చేతనున్న
గిలుకుటద్దంబునం దిలకించి యామె
చిఱునగవుతోడినునుసిగ్గు చేత గునియు
నామనోహరదృశ్య మెంతైనఁ జేయు.

తే. గీ. మొలకనవ్వు మోవి నాట్యంబు సలుపునపుడు
చిరుమఁబొల్గారు ప్రియురాలి చెక్కులందుఁ
బొడమువిఱుగుంటలను వ్రేళ్ళమొనలనొక్కి
యాపునాతఁడు శృంగార ముట్టిపడఁగ.

తే. గీ. తనయలఁతియూరుపులు మోముదమ్మిఁ గ్రమ్మి
వలపు లూరింపగా సమీపమున నిల్చి
చిగురుఁ గెంగేలఁబట్టి గోక్షీరపాత్ర
పెదవికందిచ్చుఁ బతికిఁ బ్రత్యుదయ మామె.

తే. గీ. నిలువుటద్దంబులోఁ దననీడఁజూడఁ
జిత్తమే లేనియటులుండి, జీవితేశు
నెనరుగన్నీటిలోఁ దననీడఁజూచు
నోడలుసర్వంబు గన్నులై యున్నయట్లు

సీ. కలకలఁ నవ్వుకన్నులు కన్నులంబెట్టి
లీల బాహులఁ గంఠమాలఁజేయు
మిలమిలఁ మెఱయుచెక్కిలి చెక్కిలికిఁజేర్చి
పట్టి చేతిని మెడచుట్టుఁజాచు
గలగలఁ మొఱయుతళ్కుల బెళ్కులందాల్చి
కొసరిమాటికి గుజగుజలువోవు
జిలజిలఁ దేనెచిప్పిలుమోవి మోవిపై
నిలిపి నిల్వున మోహనిద్రఁబుచ్చు

తే. గీ. పొడిపొడిగరాలిపోవు మైపూఁతతోడ
వడవడిగఁబర్వు నిట్టూర్పువలపుతోడఁ

జిలుచెమరుతోడఁ బతిమేన శిరముఁ వ్రాల్చి
నెనరుగన్నీరుచలువపన్నీరు రాల్చు.

తే. గీ. పాలనీటిగులాబి లేఁబైరగాలి
నించుక చలించునట్లు చిట్లించిమోము,
శితకటాక్షంబులఁ విరజిమ్మి యామె
పొలయలుకనేని పతిని సమ్మోహపఱచు.

సీ. అలిగెడువేళ కాలాహిందూదల ధగ
ధగఁ బ్రజ్వలించురత్నంబులగుచు
కనలెడివేళ మేఘచ్ఛన్నమై నీట
బింబించు సాంధ్యరాగంబులగుచు
నవ్వెడివేళ నానందలీలాతరం
గారూఢమగు రాజహంసలగుచు
శ్రమఁజెందువేళ సుశ్యామలాభ్రముల మ
ధ్యఁగఁ దేలిపోయెడుతారలగుచు

తే. గీ. సరసమాడెడునెడ నీలజలతరంగ
సంచలచ్చంద్రికాంచలాంచలములగుచు
మాటికొకసూటి నామెదృఙ్మండలముల
వెడలి జ్యోతిఃప్రభలు వెల్లివిరియుచుండు.

సీ. పండినకమ్మసంపంగిరేకులవంటి
మృదులాంగుళులు సారెఁ గదలుచుండ
పాలఁజక్కెరవోలెఁ బంచమశ్రుతిలీన
మగుకంఠ మమితరుచ్యంబుగాఁగ

కృతులయందొదుగుసంగతులు తీగలనుండి
జలజలరాలుపుష్పములఁబోల
శృంగారవనచైత్ర శేషానిలములట్లు
వలపించుమధుర భావములు వొదల

తే. గీ. కిన్నెరనుమీటి వివిధభంగికల నామె
గురియుగానామృతంబును గ్రోలిక్రోలి
యెంత కేనియు నాతఁ డొక్కింతయైనఁ
దనివి జెందఁడు తృషితచాతకమురీతి.

చ. చిగిరిచియున్న దేదొ వికసించిన దేదొ యెఱుఁగరాక జం
టగఁ బెనవైచి లేఁజిగురుడాలును పుష్పవికాస మేకహే
ళిగ నొకదానిపైఁ బ్రతిఫలింపఁగ జేయుచు నొక్కఁ డొంతొము
ద్దగునునుదీవలట్లు లలరారుచునుండిరి వారలాల్మగల్.

సీ. జీవితోద్యానసంస్థితదృఢస్నేహంపుఁ
దీవ పూచినయట్టి పూవులనఁగ
దాంపత్యసుఖసముద్రమున నొండొంటితో
నొరసి యువ్యెలలూఁగుతరగలనఁగ
శృంగారదివిఁ జిత్రచిత్రభావపుఁ బల్ల
టీలువైచెడు పావురాలనంగ
నిత్యసంతోషచంద్రికను స్వేచ్ఛావిహా
రంబొనర్చెడుచకోరములనంగ

తే. గీ. ఒకరొకరిచేత వికసనంబొంది యొక్క
రొకరియందున లీనమై యొక్కరొకరి

కున్నతింగూర్చి ద్యోతిల్లి యొక్కవింత
యందమిచ్చిరి వార లానందమునకు.

తే. గీ. నింగిబంగరుచాయపైఁ జెంగలించు
చిటిపొటి మొయిళ్ల చిత్రవిచిత్రరూప
సంఘటనలెల్ల నాశ్చర్యచకితదృష్టి
నవధరింతురు వారు సంధ్యాగమముల.

తే. గీ. అపుడపుడువారు శాఖశాఖాంతరాళ
నిర్గతస్వీయశయనమందిరగవాక్ష
సన్నిహితచంద్రకిరణగుచ్ఛముల దెరలు
మిసమిసలఁ గ్రోలుచుందురు రసపిపాస.

చ. పొడిపిళులాడుచున్ గపురముంబలె మేల్ తెలుపుం బు
నుంగుకై
వడినెఱతావియుంగలిగి పట్టువలెన్ మృదువై ఘృతంబుతో
నుడికినటుల్ నిగన్నిగల నొప్పుచు నప్పుడుపిండు పాలఁ బో
లెడి నులివెచ్చనన్ బరిమళించెడుకుంకుమపూరసాన్నమున్.

చ. చిఱునవుతోడ మేలినగిషీగలబంగరుపూలవెండిప
ళ్లెరమునునించి సుంతగదలింప ఘుమంఘుమయంచు
జిహ్వపై
గరఁగెడుశాకముల్ రకరకంబులు చుట్టునమర్చి చేర్చి
పొరలెడియాజ్యధారఁదనివోవఁగ వడ్డనసేయునిచ్చలున్.

చ. అడుగులనొత్తుచున్ దములపాకులచారికలేనియుం గనం
బడుగళమెత్తి సన్ననిరవంబునఁ జల్లగఁ బాటపాడి నె

య్యాఁడు సుఖనిద్రఁజెంద నొకయోరగ శయ్యబరుండియామె రే
గడవగ మేల్కొనున్ మగనికన్నను మున్ దెలవారు
జామునన్.

ఉ. ఏయమగర్భమందు జనియించెనొ యామె, కృపారసంబుచే
నాయమచిత్తమెంతమృదువైనదియో, పువుదోటలోనికిం
బోయియు నంతటంగలయఁబూచినతీవల వంచియున్ బువుల్
గోయఁగఁజేయిరాకమురలున్ మునువచ్చినత్రోవనొక్కఁడన్

సీ. వరుఁడింకొకనివంటివాఁడొకో! మనసిచ్చి
మాటాడు మన్మథమన్మథుండు
ఆడుబిడ్డల నెంతయని మెచ్చుకొనవచ్చు
తానుగీచినగీటు దాటఁబోరు
ఉడిగంబువారలే యుగమువారో గాని
కొలువనెప్పుడు గాచుకొనియుంద్రు
రనువత్సరంబు మాన్యక్షేత్రములయందుఁ
బండుపంట తెఱంగు పాలపొంగు

తే. గీ. తావులకుఁ దావలంబైనపూవుతోట
నడుమ నొకదివ్యభవనంబు నన్నివాస
మారగింపగ వెండిబంగారుపాత్ర
లేమనఁగవచ్చు నాపెయదృష్టరేఖ.

చ. ఇరువురుగూడి వేడుకమెయిన్ మతసాంఘికరాజకీయసం
స్కరణగుణాగుణాచరణసాధనరూపవిచారణాపర
స్పరవిజయాభిలాషయికచాకచకిన్ మృదువాక్ప్రయోగముల్
నెఱపుదు రెల్లవారువిని నివ్వెఱవోవ నొకొక్కపట్టునన్.

చ. నవయుగభారతప్రచలనంబు లనంతములైనవిశ్వమా
నవపరిణామలీలలు సనాతనవైదికధర్మవృత్త్యుప
ద్రవకరదాస్యజీవనపరస్పరవైరవిఘూర్ణమానహైం
దవదురదృష్టరేఖికలుఁదత్కృతచర్చలకుఁ బ్రధానముల్.

ఉ. వర్ణవిభేదదోషపరివర్జితదివ్యతపఃప్రభావసం
పూర్ణపురాతనార్యఋషిపుంగవపుణ్యవనాంతరస్థలీ
పర్ణకుటీరవాసనిరుపద్రవనిర్మలనిత్యజీవన
స్వర్ణయుగప్రసంగములుసల్పుచురొక్కెడగూడి యిర్వురుఁ.

'శారద' నుండి

## సముద్రవర్ణనము

మ. అరుణుండేగెను కాలపూరుషునిచే నాకాశవీథిమనో
హరదుర్గాపరదిక్సువర్ణమయసింహద్వార మామిూఁదటఁ
తెఱువంగాఁబడుచుండె నింకవెడలుఁ రేరాణి భూలోకసం
చరణార్థంబనిమ్రోగెనల్లెడ నుదంచత్పక్షితూర్యధ్వనుల్.

మ. అలకల్ దిద్దుచు, రత్నకంబళముచాయంబొల్చులేఁబచ్చికం
గలయంజూచుచుఁ, బూలతీగియలపైగా సారెకేతెంచుచుఁ,
మెలమెల్లన్ మెయిఁబ్రాకుచున్, నవనవోన్మేషంబు
వాటించుచున్,
వలపింపన్ బసిపైరగాలి వనిలో వాహ్యాళిగావించుచున్.

మ. ఇరువంకంగలపూలపై ముసురుచున్, హేలాగతిన్ వానిపై
పొరపుష్పాళ్యొకచోటినుండి యొకచోఁబొందించుచున్, బుష్పకే

సరదాంపత్యసుఖానుభూతిఘటనాసంసక్తమై తేనెయో
గిరముం బారణసేయుభృంగపటలీగీతంబు లాలింపుచున్.

మ. అటులిట్టుల్ విహరించి, కొంతవడికా యారామకేళీసర
స్తటనానాఫలవృక్షసంతతుల చెంతంజేరి, తత్కాలసం
ఘటితాకాశవినీలమేఘములవంకన్ దృష్టిసారించునం
తటిలో శారదమ్రోలనిల్చెనొకనూత్నవ్యక్తి నిశ్శంకతన్.

మ. ఎపుడిచ్చోటికి నేగుదెంచితి, రవీ! యీవత్సరంబైనఁ బ
ట్టపరీక్షన్ జయమొందుజాడ పొడగట్టంజొచ్చెనే? చెన్నప
ట్టపువాసంబు సుఖప్రదంబగునె? యిష్టాగోష్ఠినచ్చో సము
ద్రపుఁదీరంబున మిత్రులంగలిసి సంధ్యాకాలముంబుత్తువే?

మ. అనిప్రశ్నింపఁగ నాతఁడీదినము మధ్యాహ్నంబునన్ జేరినాఁ
డను పట్టంబుననుండి యీవిజయవాడన్ శారదా! శక్తివం
చనలేకుండ లిఖించినాడను పరీక్షాపత్ర మట్లయ్యు వా
కొనరా దేఫలితంబు వెల్వడెడినొక్కో! కాలగర్భంబునన్.

మ. అవశిష్టంబగు 'చెన్నపట్టణ'నివాసానందముంగూర్చి యెం
తవచింపంగఁ గడంగినన్ దనివిఁజెందంబోను మే! అందునే
దోవిశేషంబు నిమేషమున్ నడచుచుండున్ ద్రవ్యమన్ పేరివ
స్తువొకండుండిన హాయిమైఁగడుపవచ్చున్ జీవితంబంత
యున్.

శా. సాయంకాలసముద్రతీరకృతసంచారంబునం గల్గుస్వ
ర్గీయానందముఁజూఱగొంచు నపరాద్రిద్యోతమానారుణ
చ్ఛాయాకల్పితచిత్రవర్ణయుతశశ్వన్నృత్యదూర్మిచ్ఛటా
గేయాకర్ణనభాగ్యముంగననివ్యక్తింజూడఁబో మప్సరిన్.

శా. ఆయాపున్నమరేల నేను ససహాధ్యాయుండనై పోయి యా
తాయాతాబ్ధితరంగపంక్త్యుపరిభాగాపూర్ణచంద్రాతప
చ్ఛాయాసుందరసుప్రసన్నమధురస్వచ్ఛందలీలావిహా
రాయత్తంబగు దృష్టినుందును నిశీథాంతంబుపర్యంతమున్.

శా. నిండుంబున్నమపండువెన్నెలను వెండిన్ దీర్చినట్లుండి యొం
డొండుందాకు తరంగడోలికలలో నుయ్యాలలూగంగఁజం
ద్రుం డబ్ధిం బ్రతిబింబరూపమున నెంతో నేత్రపర్వంబుగా
నుండుం గన్నుల నాడుచున్నయటులేయుండున్ మదిం
బాటినన్.

మ. త్వరితాన్యోన్యతరంగఘట్టనలచేతన్ మాటికవ్వానిపై
నురుగుల్ దేటి కదుళ్ళుగట్టి కనువిందుంగూర్చునచ్చోటిసా
గరనీరంబున మిన్కుమిన్కుమనురాకాచంద్రచంద్రాతప
స్ఫురణంబున్ దలపించినన్ బులకరించున్ దేహమత్యంతమున్.

## 'సతీస్మృతి' నుండి

శా. నాఁడేకాదు భవద్వియోగ మిపుడైనన్ జ్ఞప్తికిం బాటినన్
నాడీమండలమెల్ల భగ్గుమనిమండంజొచ్చుఁ బ్రాణంబుల
ల్లాడన్ సాగుఁ గుఠారధారఁ దలవ్రయ్యన్ వేసినట్లుండు నీ
రేడున్ లోకము లస్తమించినవిధంబేతోచుఁ జిత్తంబునన్.

మ. సతియన్ దివ్యసువర్ణపక్షముల నీస్థానంబుగుర్తింప నా
యతమైనాదుమనోవిహంగ మిదె యూహాకాశవీథీసము

ద్గతమయ్యెఁ దురదృష్టవాతహతి భంగంబందునో, లేక సం
తతచింతాపరిపాకశక్తిఁగృతకృత్యంబౌనొ, ప్రాణేశ్వరీ!

మ. ననువంచించెనుగాని పాడునరజన్మంబిచ్చిదైవంబు మిం
టనుబాలింగలయట్టిపిట్టనయియున్నన్ నాబహిఃప్రాణముం
డినలోకంబున కట్టెనేనెగిరిపోనే యెన్నడో! యింక బా
ఱినయీవ్యర్థపుజీవనంబను నెడారిన్ యాత్రసాగింతునే.

మ. జడమై నిర్వికృతిన్ వహించునొకపాషాణంబునైయున్నచో
నడలంబోదునె నేనతీమరణదుఃఖాఘాతపాతవ్యథన్
బడియీరీతి దినక్రమప్రశమితస్నానాన్నపానుండనై
కడకప్పుడిదివానిశాయుగవిభాగజ్ఞానశూన్యుండనై.

శా. ఉన్నట్టుండి మనంబొకొక్కయెడ విద్యుద్వేగమాచుండు నీ
సాన్నిధ్యంబున కేగుదెంచుటకునై స్వర్గంబునందైన నీ
వున్నావో మఱిలేవొ యంచునటుపై నుయ్యాలలాగూగు ని
ర్భిన్నంబౌ నొకవేళ నొక్కపుడు నిర్వేదంబుఁజెందున్ సఖీ!

మ. మెడపైకెత్తియొకానొకప్పుడు శరన్మేఘంబులంగాంచి నీ
పొడనేమేనెఱిగించునేమొయని నేబుద్ధీంద్రియక్షోభతో
నడుగన్ జూచెద మెన్నొచుక్కల ననంతాకాశమం దైన నె
క్కడనీచక్కనిచుక్కఁగానమను సంజ్ఞన్ దెల్లవోవున్ సఖీ!

మ. కలకాలంబిట నుట్టిగట్టుకొని యూగంబోనుగా, నేటికిన్
నలకల్ మూడగుపట్టుచుండెగద, ప్రాణంబింకనీకళ్ళముం
గలగాఁ జల్లఁగ దాటిపోవగలభాగ్యంబెప్పుడో, యంచు నీ
వలనాఁడూరకయన్నయప్పలుకె సత్యంబయ్యె నాత్మేశ్వరీ

మ. తెలుపంబోలనియీయాహృదంతరదహాత్తీవ్రాగ్రిహోత్రంబు
కాం
తిలఁజేయందిరుమంత్రమిప్పుడు చితాగ్నిజ్వాలయేకాని వం
తలునుం జింతలు సుంత కావనుట తథ్యం బుష్ణముష్ణేనశీ
తలమన్ వాక్యగతార్థ మిప్పటికి బోధంబయ్యె నాత్మేశ్వరీ.

మ. నిరు డేఁ గన్నులఁజూచుచుండఁగఁ జితాగ్నిజ్వాలికామాలి
కాం
తరతప్తంబొనరించి నీతనుసువర్ణంబందుఁజెన్నొందుసుం
దరతేజంబుహరించిదైవము, శ్మశానక్షోణిలోనిల్పె నా
కొలుకై బూది, హరించెవాయువదియుఁ గోరంత లేకుండఁగన్

సీ. జ్వరితవైయున్ననీచాయనే భూదేవి
యును ఎండవేడిమినుడికిపోయె
అగ్నికీలలలోనియానీవలెనె నిర్వి
శేషయయ్యెను దినశ్రీవధూటి
మండుమంటలడంగుపండునిప్పటుసంజ
గగనశ్మశానభాగమునఁగాలె
నిప్పుపైపైగప్పునివురునాఁబెలిమబ్బు
పలుచపైసంజపైవెనఁగవిసె

తే. గీ. ప్రియసఖి! మనప్రేమజీవితమువలెనె
ముడివడియెమూఁడుసందెలు, మునిగిపోయె
నంధకారతమాలలోకాంతరముస
నఖిలలోకము, నే శోకమందువలెనె.

తే. గీ. ఎఱుఁగనిమనోవ్యథ యొకాని యొంతొ కాల
మటుల జ్యోతిఃప్రభలతోడ నక్షిగోళ
మేఘములఁ జూపుమెఱపులు మెఱయుమీఁద
మరణనిర్ఘాతపాతంబు జరుగకున్నె.

సీ. అధికప్రయాసజిహ్వానీతమందమం
దాంత్యకాలనివేదనాక్షరములు
పరివేదనాముహుర్ముహుర్భవబాష్పధారావి
లోలసాకూతావలోకనములు
జ్వరతీవ్రతీవ్రతాత్వరమాణహృద్యంత్ర
చరమనాడీహఠాత్స్తంభనములు
ఇహనిరాశానిస్పృహైక సూచకముఖ
చంద్రాస్తమయతిరశ్చాలనములు

తే. గీ. విషమఘటనావిభిన్నవిభిన్నమైన
నాహృదయదర్పణమున ననంతములుగఁ
బ్రతిఫలించుచునొసరించు ప్రళయతాండ
వార్భటి భయంకరాతిభయంకరంబు.

మ. అతిశీఘ్రంబుగనస్తమించె నొకసంధ్యాకాలపుంజుక్కకుం
బ్రతియైకన్నులపండువైన మనదాంపత్యంబు, కానీ భవ
త్ప్రతిరక్తబైపౌరమెల్ల నూడిపడిపోవం జేసి నీయట్లు భి
న్నతలేకుండుననంతమందెపుడు లీనంబౌదు నాత్మేశ్వరీ!

మ. కడుపుందీపియు గాఢమైనయనురాగంబేకమై మాటికిన్
విమలప్రత్యగ్రశుకణంబునందుఁ బ్రతిబింబింపంగ సంతానము

న్నెడరుం నాయెడకక్షిగోళముల నీవిట్టట్టులం ద్రిప్పిచూ
చెడునీయాకడసారిచూపెననుమంచేఁ నేటిపర్యంతముం.

మ. మరణానంతరమందు నింకనొకజన్మంబెత్తితో! మాపయిం
మఱినీకుంగల ప్రేమపుంబెఱపెఱం మామధ్యనేయెప్పుడుం
దిరుగంజొచ్చితొ! లేకయాయొడలితో నేనీవునుందీఱితో!
పరలోకంబును జేరితో! తెలియు ద్రో వంజూపుమాత్మేశ్వరీ!

మ. మురిపెంపుంబసిబిడ్డలం విడిచి, నీమూలంబునం సాగుకా
పురమధ్వానమొనర్చి, యాదినమునం బోలేక పోలేక తీ
వరమా వేదననుండియుం గనులతో భాషించి, యేకోర్కె నా
కెఱుంగంజేసితి దానినేమఱతునే యేనాటి కాత్మేశ్వరీ!

తే. గీ. తత్తరుచితంబులైనవర్తనలవలన
బాల్యముననుండి పెనుపంగబడినయొడలె
నాకునీకిప్పుడడ్డమె నడుమ నిలిచె
నింతకన్నఁగృతఘ్నత్వ మెందుఁగలదొ!

శా. ఆకాలంబుగతించె, నాసుఖమదృశ్యంబయ్యె, నాప్రేమపుం
జోకల్ పోకలు దృగ్విలాసనటనల్ శూలాయమానంబులై
తాకంజొచ్చె, క్షణక్షణంబు హృదయాంతర్నాళజీవాణులె
ట్లాకంపించుచునున్నవో యెఱుగవా, హా నామనోవల్లభా!

శా. శోకాఘాతవిపర్యయస్థితిని సంశూన్యంబుగాఁదోచునీ
లోకంబందున నేమిప్రామికొననాలోచించెనోగాని ఛా
యాకారంబుగవచ్చిమృత్యువు సమాహ్వానంబుఁగావింప న
జ్జాకంబెట్టదొడంగె నస్థిగతకాయంబెంత హేయంబొకో!

చ. కుడిచనుబాలు ద్రావుపసికూనను వానియనుంగుఁదల్లి తా
నెడమకుఁద్రిప్పి చన్గుడువనిచ్చెడునంతటిలోన బిడ్డ యె
వ్వడువునఁబోరువెట్టుఁ బ్రతిప్రాణియునట్టులె యీప్రపంచమున్
విడి పరమేగునానడుమ వేదనపాలగుఁగాదె, ప్రేయసీ!

చ. నది నౌకాగమనంబుచేఁగలుగునానారూపపుంజీలికల్
పిదపన్ గల్పినయానవాలయినఁ గన్పింపఁగఁబోనీని పా
ఉదలంబోలి సమష్టిలోఁబోడము వేఱుంబాటులన్ దిద్దియొ
క్కదర్శ సంస్కృతినిర్వహించితివి లోకంబెన్న నాత్మేశ్వరీ!

తే. ఆడుకొనుసీడున వివాహ మాడినాము
కౌమరుఁబ్రాయంబునం గవగూడినాము
ఐహికానందమును చూఱలాడినాము
విధివశంబున నీనాఁడువీడినాము.

తే. సరళమూఁ బ్రశాంతమును సుప్రసాదమధుర
తరమైన నాటిజీవితాచరణమెల్లఁ
బరమనిస్పృహచేఁ బటాపంచలయ్యె
క్షారసమ్మిశ్రితంబైన క్షీరమట్లు.

తే. కలువనో! లేకచక్రవాకమునో! గాక
కటకటా! మానవుఁడనైన కారణమునఁ
బవళులుఁ రేలు నేనొక్కపగిదిగాఁగఁ
గ్రాగవలసెను నీవియోగవ్యథాగ్ని.

తే. పదపదవినిస్రుతంబగు ప్రాణధార
దినదినము నాకు నవనవోత్తేజమొసఁగఁ

బలుకరించెదు నా ప్రాణపదము లేని
పాడులోకాన నేనేల బ్రదుకవలయు.

తే. గీ. అడుగుటయనంగ నుడువుటయనఁ జిరాకు,
అడుగడుగునందు బ్రహ్మాండమగు పరాకు,
నాకు దుష్ప్రాపకంబగులోకమునకు
నేమిసంబంధమో! ఉండుటెందుకో అకో!

చ. అది మనమారహస్యనిలయంబుననుండి పరస్పరంబుగా
హృదయము లంకితంబులొనరించినపుణ్యదినమ్ము, నాటి నీ
మృదుతరముగ్ధమోహనశరీరముఁ, జల్లనినీగులాబిపూఁ
బెదవులమీఁది లేఁనగవు పన్నెలవన్నెలెతోఁచు నెల్లెడన్.

చ. ఎదురుగనుండియొక్కయెడ నిర్వరముల్ బెదవుల్ చలింపకే
మదిమదిమాటలాడ మనమధ్యనెమధ్యనె చూపుచూపునం
బదిలపడంగ నాడుగఁపుపంబడియుండినపుణ్యకాలమే
మెదలెడికన్నులందెపుడు మేల్కొనినన్ నిదురించుచుండినన్.

చ. మెలినిడుకొన్నపాదముల మెత్తపయిన్ సగమొత్తిగిల్లి చె
క్కిలి యఱచేతమోపి కనుగీటుననే కడునీటు జూపి న
వ్వొలయగఁజేసిన న్వలచియున్ వలపించినయట్టి నాటియా
పొలకువవాటినంతన చివుక్కుమనున్ హృదయంబు
సర్వమున్.

మ. ఒడియందుండినయట్టి మల్లెపువులం దొక్కొక్కటిన్ దీసి వా
ల్జడయల్లించుకొనంగఁ దల్లికిడు వేళన్ వచ్చునన్ గాంచి వె

ల్వడగా నిల్వఁగ బాఱువోక మునిగాళ్ళఁ నిల్చి నానాటినీ
పడుచుం బ్రాయపుఁజిన్నెనాకనులకుఁ బ్రత్యక్షమౌఁగావుతఁ.

చ. మనసులు మాటలుం గ్రియలు మర్మము లేకముఖంబుగాఁగ వె
చ్చనినునుకోరికల్ విసవిసఁ మసలన్ మును చూఱి
గొన్న తీ
యని సుఖపారణంబు హృదయప్రతిబింబితమయ్యె దర్పణం
బునఁ బ్రతిబింబితంబయిన మోహన దివ్యధనంబుచాడ్పునఁ.

తే. గీ. సహజకోమలమైన పుష్పంబెగాక
కఠినశిలయేని యందమై క్రాలునట్లు
హాసమేగాక నీయాగ్రహంబుసైత
మమృతధారాభిషేచనం బాచరించె.

తే. గీ. ఎదనెదంగదియించుచు నిమిడియిమిడి
యొకరికౌఁగింటనొకర మట్లున్న నాటి
ప్రణయబంధంబు నాకునిప్పటికె కాదు
మఱపునకురాదు వేయిజన్మములకైన.

తే. గీ. ఒకటనేకాంతముననుండి యొకరినొకర
మతిమృదులమైన పరిహాస మాడుకొనుచు
లోతెఱుంగని నవ్వులలోన మునిగి
తేలుటా నాటితోడనే తీఱిపోయె.

సీ. ఉదయంబునుండియొక్కొకమహాయుగముగా
గడియయుంగడె తిరుగంబడంగ
మధ్యాహ్నమై సూర్యమండలం బటువ్రాలఁ
బోవుచో హృదయ ముప్పొంగిపోవ

వికచపుష్పము నభోవీధిగా నీసఖ్య
మునకె నాప్రాణ మున్ముఖముగాఁగ
ఎల్లరక్తప్రవాహికలు నీకేవకే
ననుఁగొనిపోవుచేవను రహింప

తే. గీ. పవలుపవలెల్లఁబ్రణయవిశ్వాసభరము
లైననిశ్వాసములతోడ నల్లనాఁడు
సలిపియుండిన యానానిశానిరీక్ష
ఇపుడు నాప్రేమ కగ్నిపరీక్షయయ్యె.

తే. గీ. కెలనికిం జేరి కేలికింగేలుసేర్చి
సృష్టిగూరిచి నీవొనరించునాటి
సరసచర్చాపటీరచర్చాముచర్చి
ఆత్మకు దహద్దహద్దహనార్చి యయ్యె.

సీ. ఒకటిరెండుగమాత్రముండి మోమున నాటి
యాఱనిచినుకు ముత్యాలతోడ
నొకకొన్ని చిఱుతగాలికి రేగఁ దడినంటు
కొను కొన్నిచిన్నిముంగురులతోడఁ
దడిపొడిపారిజాతపువన్నెరైకపై
పన్నిటిపువ్వువన్నె పైటతోడ
అడుగుదమ్ములమీఁది కఱజాఱు చీరకు
చ్చిళ్లుదిద్దెడిచివుర్ వ్రేళ్ళతోడ

తే. గీ. వడివడిగనాఁడు దొలకరివానలోనఁ
బరుగిడుచు నింటిలో జొరంబడినయట్టి

నీమధురరూపరేఖ కన్పించినట్లు
తలఁచిమది యిప్పు డూరక తత్తరించు.

సీ. సన్నజాజులసువాసనతోడి చినుకుము
త్యాలతోల్కరిమొల్కగాలికన్నఁ
దడిదుక్కినుండి వెల్వడుతావితీవితోఁ
దేలియాడెడి పైరగాలికన్న
గోవజవ్వాదిభుగ్గురుభుగ్గురులతోడఁ
గలిసిపోయిన వలిగాలికన్నఁ
బచ్చగోరంటపుప్పపరీమళంబుతో
జతగొన్న మలయమారుతముకన్న

తే. గీ. మధురమధురంబు, మంజులమంజులంబు,
ముగ్ధముగ్ధంబు, మోహనమోహనంబు,
నీసురభిళాతిమృదులనిశ్వాసపవన
మకట ఛాయామయస్వప్నమయ్యె నేఁడు.

సీ. వెనుకకుంజనుచు నొడ్డున సముద్రంబు ని
ర్గ్మించుచుండెడునట్టి మెట్లమాడ్కి
విసరి గాలిదుమార మిసుకతిన్నియలయం
దున నమర్చుచునుండు నొక్కులట్లు
లోకవిధంబగుమీనునొడలిపై మిలమిలన్
మెఱసిపోయెడునట్టి పొరలకరణి
నపుడప్పు డాకసంబందుఁదోఁచు నలంతి
యలఁతిమబ్బులలోని యలలపోల్కిఁ

తే. గీ. గనులు రెండైనఁ జూపు నొక్కటిగఁజేసి
హృదయముఁ గలంచుచుండు నీయుదరవళుల
నంటనుంకింప నీవింతనంత నొదుగు
దృశ్యమునకును నాకునుం దీఱె ఋణము.

సీ. కడుఁజిన్నిమబ్బు లొక్కటియు నొక్కటిగూడి
యపుడప్పుడే యవలవలఁ జనుట
సంజయందలి యపరంజిచాయలు వోయి
కటికచీకటి దెసల్ గ్రమ్ముకొనుట
మినుకుమిన్కను నెపంబున మింటితారకల్
ననుఁజూచి ముసిముసినవ్వు నవుట
అల్లనల్లనఁ బ్రభాతాయాతవాయువుల్
చెవిచెంత గుజగుజల్ సేయుచుంట

తే. గీ. కనుగొనుకొలంది మనవియోగంబెగాక,
నాప్రకృతజీవితమును లోకప్రకృతియు
నాసహోదరమిత్రానునయములెల్ల
నుల్లమునఁదట్టు నచ్చునం దొత్తినట్లు!

తే. గీ. చితిపయింబెట్టి నిన్ను భస్మీకరించు
ఘోరదృశ్యంబు నాజీవకోశమంటె
జీవితేశ్వరి ! యిఁకనెంతశీఘ్రగతిని
చేరవత్తునో నీవె వీక్షింతుగాత!

## 'ప్రణయలీల' నుండి

మ. కడురమ్యంబుగఁ బూచు నేతరుణవృక్షచ్ఛాయనో
కాలముల్
గడుపన్ జెంతఁ బికస్వరంబు, రసవంతంబౌ ప్రబంధంబు సా
పడ సుస్వాదుఫలంబులున్, మధురముల్ పక్వాన్నముల్,
మోవిపై
నిడ, ద్రాక్షామధుపాత్ర యున్న యెడ నీవే, స్వర్గ
మిం కేటికిన్!

మ. అవిగో! రాలుచునున్న యాపువులచాయన్ మృత్యుని
శ్వాసవా
యువులన్ వ్రాలిరి యెందఱో మనసహాయుల్ నెయ్యు
లేకొంచె మా
యువౌ యీదేహము నంటియుండగనె నోరూరించు
ద్రాక్షాఫలా
సవ మాకంఠముగా ననుక్షణము నాస్వాదింత మాత్మప్రియా!

మ. తలపై నొక్కొకపువ్వు రాలిపడుచుండన్ బైడిలేయెండ చు
క్కలనెమ్మేనులఁ గమ్మదెమ్మెరలమొల్కన్ నీటిపన్నీటిచు
క్కలఁ జిల్కన్ సరసీతటిన్ వకుళవృక్షచ్ఛాయలోఁ
గెంపుఁజా
యల ద్రాక్షారస మారగింతము, వయస్యా! భుక్తశేషంబుగన్.

శా. ఆకాశంబను పానశాల నుదయంబన్ పాత్రతో స్తోత్రమున్
రూకన్ గైకొని సూర్యుఁడిచ్చురుచిరారుణ్యంపు ద్రాక్షారసం

బాకంతంబుగ నారగింప నిపు డెట్లాయ త్తమౌచున్నదో
లోకస్థావరజంగమప్రకర మాలోకింపు మాత్మప్రియా!

నవనవంబగు జీవనముఁ బ్రసాదింప
విశ్వమంతయుఁ బల్లవించు వర్షమున
జీవిజీవికిని ధారావాహికముగ
హృది రాగరస మావహిల్లు వర్షమున
అనునిమేషంబు నీయధరబింబంబు
పిలుచుచున్నటు వలపించువర్షమున
అలరు ద్రాక్షారసం బాపాత్రతోడఁ
బ్రేయసీ, తెచ్చి నాపెదవికందిమ్మ!
ఇఁక రాదు తిరిగి పోయినని మేషమ్ము
మనదియౌనో, కాదొ, మరునిమేషమ్ము!
తత్క్షణమ్మె తెమ్ము ద్రాక్షారసమ్ము
నాస్వాదనానంద మనుభవింతమ్ము
నేవెన్నదీయఁగా నీళులం జిలికి
ఒడి బిడ్డఁ డుండఁగా నూరెల్ల వెదకి
చెలియ మూల్యంబైన జీవితమునందు
అకట! కాలంబెంతొ హాత మొనర్చితిని
చాలు నేపడినట్టి శ్రమము సర్వమ్ము
బూదెలోఁ బన్నీరు పోయుటైపోయె.

మ. ఒకరూపంబె వహించు మేఘములమై యోముత్యమా! యోయమా
యికమా! కొండలఁదేలిపోవుదమ! కాదేఁ జంద్రకాంతాలమై

ఒకమాఱు వికసించి వెన్నెలకు లోలో లీనమైపోదమా
ఇఁకఁ గ్రొంగ్రొత్తగ నొక్కరింకొకరమై యే నీవు జన్మింతమా!

మ. జతగా నిర్వ్యర మేకరూపమె వహించఁగ నీకు నీవేళ లో
హితమై యుండక పోయినట్లయినఁ బోనీ! నీవు పుష్పించుమా
లతివై నేఁ బ్రకృతిప్రీతిఁ బ్రణయలీలాగీతికల్ వాడి నీ
ప్రతిపుష్పంబు మరందబిందువుల నాస్వాదింతు భృంగంబనై.

మ. అదియుఁగా నీకు ననిష్టమైనయెడ సంధ్యాస్వర్ణవర్ణంబుచేఁ
బ్రామువంగాఁబడినట్టి చంద్రకళవై పౌర్ణిమ్మవు దివ్యోదక
హ్రదమైపోదును నేను నాయుదకమధ్యంబందు బింబించి నే
గదలఁగా గాలికి నీవునుం గదలి యూఁగఁగా వచ్చు నాలోపలఁగా.

## 'రామాయణము' నుండి

సీ. అది చిన్ని చిన్ని ముత్యాలు ముత్యాలుగా
సెలయేటిలో నీరు చిలుకుచోటు
ఆ చిన్ని నీటిముత్యము ముత్యమును ముద్దు
లొలుకు నా సమయ మర్కోదయంబు
ఆ స్వర్ణ సూర్యోదయంబు పర్వతపర్వ
తాంతరాంతర భూరుహాంచలముల
నామంచలములపై నాడు నా యారుణ్య
మహాహా! యెంతటి హృదయంగమంబు!

తే. గీ. ఆ యకృత్రిమ రామణీయక వినూత్న
రత్నకాంతి ప్రవాహ నీరాజనమున

రాజిలుచున్నయతఁడె శ్రీరామమూర్తి
జలధరశ్యామసుందరచక్రవర్తి!

సీ. ఆవిశ్వమోహనం బగుపరబ్రహ్మంబె
జానకీహృదయపంజరశుకంబు
ఆపరంజ్యోతియే యల్లరాఘవపర
బ్రహ్మజీవనసుప్రభాతగీతి
పతిరాఘవుండెట్లు ప్రత్యక్షమైనట్టి
జనకునిపూర్వపూజాఫలంబొ
సతిజానకియునట్లె జనకరాజమహర్షి
శాంతిభూమీరుహచ్ఛాయ యయ్యెఁ

తే. గీ. బురుషులం దట్టి శ్యామసుందరునిఁగాని
స్త్రీలయం దట్టి సౌందర్యతిలకఁగాని
పతిసతుల నట్టి పుణ్యదంపతులఁగాని
కనివినియెఱుంగ మెందు నేకాలమందు.

సీ. మాణిక్యముగ విశ్వమాతృగర్భమునుండి
యావిర్భవిలిన ప్రత్యక్షలక్ష్మి
చందనాంకురముగా జనకరాజమహర్షి
సాకికొన్నట్టి కన్యాకుమారి
జాజితీవగ రామచంద్రమందారంబు
నాశ్రయించిన తదాయత్తచిత్త
తోడునీడగ భర్తతో ఘోరకాంతార
మనుగమించిన ప్రణయప్రపూర్ణ

తే. గీ. ధరణిజనయిత్రి తరుసహోదరు లొసంగు
జేగురుంగుంకుమము నారచీరదాల్చి
చూచితే! సీత చక్కనిచుక్కలీల
నెటులనిల్చెనో తనజీవితేశు మ్రోల!

సీ. వలసినంతగఁ బ్రాణవాయు వాఘ్రాణింపఁ
బారణంబొనరింప ఫలరసంబు
తీర్థమాడంగ నదీప్రవాహజలంబు
వస్త్రంబుగ ధరింప వల్కలంబు
జపతపంబులదీర్ప సాంద్రవృక్షచ్ఛాయ
అట నధిష్ఠింపఁ గృష్ణాజినంబు
ఆనంద మొందఁ నాత్మానుసంధానంబు
విశ్రమింప స్వయంకృతాశ్రమంబు

తే. గీ. పవ్వళింపంగఁ బచ్చికప్రంపుటనంటి
యాకుఁబాకను లేఁజివురాకుఁబాన్పు
కలదె! లక్ష్మణ! స్వర్గలోకముననైనఁ
బావనం బీమహారణ్యజీవనంబు.

సీ. పఱచినరత్నకంబళము లట్లలరారు
సెలయేటిగట్ల పచ్చికబయళ్ళు
గోగణంబుల మేపుకొనుచు నాలాపించు
విప్రబాలుర సామవేదగీతి
ప్రతిఋషీశ్వర కుటీరంబు వెల్వడివచ్చు
వైశ్వదేవసుగంధవాయులహరి

ఫలభారమూని చూపఱకు నమ్రత్వంబు
బోధింప వ్రాలిన భూరుహములు

తే. గీ. ఆశ్రమమహీరుహంబుల కవలియవలి
యపరసంధ్యాసువర్ణసూర్యాస్తమయము
నామహీరుహమందమందానిలముల
హాయి యలవడు నెంతపుణ్యమున వత్స!

సీ. ఫలవృక్షముల మధ్యభాగమం దొక్కొక్క
యతికి నొక్కొక్క పుణ్యాశ్రమంబు
ఆశ్రమాశ్రమమునం దఖిలవిద్యాబోధ
కొఱకునై యొక్కొక్క గురుకులంబు
గురుకులంబులఁ జుట్టుకొని యున్నకుండ నీ
వారంబుపండు కేదారకములు
కేదారకములలోఁ గ్రిందరాలినయట్టి
కొలుచు భక్షించు శకుంతకోటి

తే. గీ. ప్రతిశకుంతము సాయంప్రభాతములను
దినదినముఁ బాడుతీయని తేనెగీతి
గీతిగీతియు శబ్దించుగిరులదరుల
రమ్యగంభీర మిమ్మహారణ్యభూమి.

## శూర్పణఖ నాసికా ఖండనము

విరమించె నిపుడిప్పె విశ్వరంగమున
నాతపం బపరసంధ్యాతాండవమును

ఒకటొక్కటిగ రాలుచున్న వంబుధిలో
మణులట్లు సూర్యాస్తమయకాంతు లవిగో!
చిరవినూతనమైన చిత్రశాలికగా
నొకవింతయొయ్యార మొలికె నాకసము
ఇంచు కుష్ణంబు నొక్కింతశీతలమై
మలయుచున్నది మందమలయమారుతము
అనిపల్కుచును బ్రదోషారంభమైనఁ
జేరువంగలయట్టి సెలయేటఁ దీర్చి
సాంధ్యకృత్యమును లక్ష్మణునితోఁగూడఁ
దిరిగి శ్రీరాముఁ డేతెంచునప్పటికి
నడవిలోలక్ష్మణుం డచ్చటచ్చటను
ఉదయంబుననె తెచ్చియుంచియున్నట్టి
కందమూలఫలాలఁ గడిగిపల్మాఱు
అనఁటియాకుల దొన్నియలయందుఁ బెట్టి
యింటిముంగలి మావియివురుపానుపున
నవియుంచగా సీత, యామెతోడుతను
పైపైన బ్రాలెడి పండువెన్నెలలో
నారగింపఁగ రాముఁ డాసీనుఁడయ్యె
ఒదిగి లక్ష్మణుఁ డెట్టయెదుటఁ గూర్చుండి
దొన్నెలందున బెట్టియున్ననొక్కొకటె
యాఫలాదులఁ జేతి కందిచ్చుచుండఁ
జవులెచ్చరించుచుఁ జానకీరాము
లెదుటి చల్లని సెలయేటిగానంబు

నాలకించుచు భోజనానంతరమున
సలుపునిష్ఠాగోష్ఠి సౌమిత్రితోడ
సవిచారముగ రామచంద్రుఁ డిట్లనియె.
రాజ్యభాగంబు సర్వం బల్ల భరతు
తలపైనమోపి యాతఁడు తోడలేక
మన మొక్కరమె యరణ్యనివాససౌఖ్య
మనుభవింపక తప్పదయ్యెగా ! యనఁగ
ననుజునిపైని గాఢానురాగంబె
యటులఁ బల్కించుచున్నది గాని యకట !
భరతుని కేమిలోపము గల్గు నచట
నగరవాసముకన్న నా సౌఖ్యమిచట
ననుచుఁ బల్కంగ లక్ష్మణుఁ డందుపైని
జననిజానకి యది సరికాని మఱిది
నీవు నీయన్నయు నే రాచనగరు
విడిచి యీఘోరాటవిని ప్రవేశించి
యెంతయో కాలమయ్యెను జూతమనుచు
మనసైన నొకమారు మాకళ్ళయెదుట
ఫలమొక్కడైనను భక్షించియెఱుఁగ
వెంతకుఁ దెచ్చి మాకిడుటయే గాని
హేతువేమొకొ ! యను నింతలో నచటి
కరుదెంచె నొకవ్యక్తి యపు డడ్డమైన
మబ్బుచే వెన్నెల మసకవాఱినను
తెలిసె వారలకేదొ స్త్రీమాత్రమనుచు

నెట నరసంచారమే లేనియట్టి
యమ్మహాటవిలోని కరుదెంచినట్టి
యావ్యక్తిఁ గనుటకే యదరి యాసీత
కనుమూతవడి విభుం గౌగిలింపంగఁ
జేతితో నిమురుచు జీవితేశ్వరుఁడు
జడుపు దీర్చుచునుండ సౌమిత్రి చూచి
ఎవరవీ విచ్చటి కేలవచ్చితివి
పనియేమి ? యన నిట్లుపలికె నావ్యక్తి
ఏనెవ్వతెనో కాను ఎవని పేర్విన్నఁ
దల్లడిల్లునో చతుర్దశభువనములును
దినమెవ్వ డర్చించుఁ దెలవారుసరికి
నవలక్షకోటుల శివలింగములను
ఎవని యున్నతరాజభవనంబులోన
సూర్యచంద్రులె వెల్గుచూపు దీపములు
ఇంద్రాదిదిక్పాలు రెల్లప్పు డెవని
పడిపంచలనుగాచి బ్రదుకుచుండెదరు
ఆరాక్షసేశ్వరుం డగురావణుండె
నాయన్న యిక శూర్పణఖ నాదు పేరు
ఉండఁడెచ్చట నంత చండశాసనుఁడు
ఆకైన గదులాడ దతఁడిష్టపడక
ఇంతకుం బ్రకృతాంశ మేమందు రేమొ
నేటిసాయమ్మున నే విలాసముగ
నడవిఁ గ్రుమ్మఁఱుటకై యటు పోయిపోయి

యీప్రైగ వచ్చుచు నిట మిమ్ముఁగాంచి
నరమాంసరుచికినై నాల్కయూరినను
ఓర్చితిఁ మీమీఁద నున్న మోహమున
ఇరువురుఁ నాకిష్టులే గాని యందు
నతఁడన్న నొకకొంచె మధికమిష్టంబు
అనుచు రాముని జూప నతఁడు లోలోన
నవ్వుకొంచును శూర్పణఖతోడ ననియె
ఇంతకుఁ మున్ను నిన్నెఱుఁగకుండినను
ఇపు డేనెఱింగితి నీవాడినట్టి
పల్కులంబట్టి నీప్రాభవంబెల్ల
నైనకార్యంబులే దకట! సోదరుల
మిరువురమును వివాహితులమే కాని
కలదిందు ధర్మసూక్ష్మం బదేమన్న
నితనియట్టులఁగాక యిల్లాలి విడిచి
యతఁడొంటిగా బాప మడవి కేతెంచె
గాన నాతని కరగ్రహణం బొనర్ప
సవతిపోరేలేని సౌఖ్యంబుగల్గుఁ
బ్రస్తుతం బనియన్నపయి శూర్పణఖయుఁ
దనువరింపగ లక్ష్మణుని గోరుకొనఁగ
సవతిపోరునకునై జడిసి యాప్రభువు
నటువంటి నవమన్మథాకారు విడిచి
ననువరించిన శూర్పణఖ ! యేమిచెప్పఁ
బ్రభ్వి వాటకు మాఱు పదదాసి వగుచుఁ

బ్రాణమున్నంతపర్యంత మవ్వారి
నుభయులమును గొల్చుచుండగా వలయుఁ
గాన నీవెటులైనగాఁని యాప్రభువు
జేపట్టఁగలిగినఁ జెప్పఁగావలె మె
నీవునుక్ వారితో సేనుగావించు
నఖిలోపచారంబు లందగా వచ్చు
నీవెయోజించుకొ మ్మేదొ కర్తవ్య
మన లక్ష్మణుఁడు సరిఁగాను లెమ్మనుచు
దిరిగి రాముని వైపు దిరిగి వాంఛింపఁ
గని సీత నవ్వాపుకొనలేకపోయె
నవువచ్చుచున్నదే ననుఁజూడఁ జూడు
మేమిచేసెదనో నిన్నిపుడంచు సాగి
మ్రింగఁబోవంగ సౌమిత్రి యద్దాని
ముకుసెవుల్ బాణాగ్రమునఁ గోసివేసి
తఱిమెఁ నాశ్రమపురస్థలమునందుండి.

## హరిజనుడు

ఒకచిన్నిపల్లె యందున్నవారెల్ల
మనసుమర్మములేని మానవోత్తములు
పొలముపండించి కాపుల కప్పగించి
యుపవాసయోగమందుండు తాపసులు
అలవారిలో రాముఁ డనువాఁ డొకండు

జ్వరితుఁడై నేఁడు మంచముఁ బట్టినాఁడు
ఇపుడింట నొక్కబియ్యపుగింజ లేదు
వలెనన్నఁ జిల్లిగవ్వయుఁ జేతలేదు
చేతికక్కఱకువచ్చిన బిడ్డలేఁడు
నీరాడి యిల్లాలు నెలవెళ్ళలేదు
పలుకరించెడు చుట్టపక్కములె లేరు
ఇలువెళ్ళుటెఁక నెట్లొ యీశ్వరుఁడె యెఱుఁగు
పొడగట్టె నెదుట నెవ్వఁడో పల్కినట్లు
భ్రమియించుచును తానె పల్కుచున్నాఁడు
బిడ్డ! భీతిలఁబోకు భీతిలంబోకు
పుత్ర! నేనధికారిభూతమునుగాను
అధికారి కే నన్న నతిభీతిగాని
సేవకునకు నేను జీవామృతమును
భయమొందు టభ్యాసపడిన హేతువున
ననుఁజూచి భయమందినావు నాతండ్రి!
ప్రజదృష్టి కీవెంత పరమనీచుఁడవొ
పరమేశ్వరునికంత పరమోత్తముఁడవు
పంపినిన్నిచటి కేఁబదివత్సరములు
దాటె నిప్పటికి నీతనువు జీర్ణించె
గంజిత్రాగుచు లోకకల్యాణమునకు
నాత్మసమర్పించు దేవాంశసంభవులు
ఇటుచుల్కనైపోవు టేఁజూడఁజాల
నీలోకమిది వమ్ము నాలోకిరమ్ము.

## 'కుచేలుని చరిత్ర' నుండి

ద్వారకాపురసమీపమున నున్నట్టి
యొకపుణ్యవనమునం దొకకాలమందు
మనమెన్న డెన్నఁడో మఱచియున్నట్టి
ఋష్యాశ్రమంబు లెన్నెన్నొ యుండెడివి
ప్రత్యాశ్రమంబులోపలఁ గుటీరంబు
ప్రతికుటీరంబులోపలఁ గుటుంబంబు
ప్రతికుటుంబియుఁ దృణీకృతపురందరుఁడు
బ్రహ్మవర్చస ముట్టిపడు ఋషీశ్వరుఁడు
నివ్వరిపైరు పండించి కొందఱును
ఉంఛవృత్తిని గొంద ఱుష్ణధారలను
కొందఱు ఫలములఁ గందమూలముల
నుదరపోషణము సేయుచునుందు రందు
మృగచర్మములను ధరించి కొందఱును
నారచీరలను గొందఱు దాలిచియును
కొందఱుకొంద రాకులను జుట్టియును
మసలుదు రయ్యాశ్రమస్త్రీపురుషులు
ఆకుఁబుట్టముఁ బాఱుటాకుఁబయ్యెదయుఁ
దీఁగెయొడ్డాణంబు జేగురుంబొట్టు
నరయగా నెంత నేత్రానందకరము
లయ్యాశ్రమంబులను గన్యాస్వరూపములు
ఏటస్నానము కొండయూటఁ బానమును

సకుటుంబముగఁ దరుచ్ఛాయ భోజనము
నానాశకుంతసంతానగానంబు
నింతకన్న నదృష్టమేమి ప్రాణులకు
అయ్యాశ్రమములలో సత్యుత్తమంబు
మనకుచేలుని యాశ్రమము వేయునేలా
ఆకుటుంబంబుగా నతిథిసత్కార
విధులెల్ల మూర్తీభవించినట్లుండు
కాని కాపురమెట్లు గడచుచున్నదియొ
అతిథు లేతేరు టన్నది లేనె లేదా
యొకకొంతకాలంబునుండి యించుకయు
నెఱుఁగనే యెఱుఁగఁడయ్యెను గుచేలుఁడు
శ్వాసయెప్పుడు సహస్రారమధ్యమున
మనసుఁ జూపెపుడు భ్రూమధ్యభాగమున
నాత్మయెప్పుడు పరమాత్మలీనమున
నిఁకను సంసార మేటికిఁ గుచేలునికి
ఒకఁడైన లేక శిష్యుండన్న వాఁడే
యెచటి కెచ్చటికినో యేగి రెల్లరును
పైపరామరిక తప్పగనె కాపుడిగె
నాశ్రమంబున నున్నయట్టి వృక్షములు
మేపువారెవరు లేమిని వట్టిపోయె
నుండిన యాయొక్క హోమధేనువును
మాటతీరునకు గోమాత్రమే కాని
చంటిబిడ్డలపాలి సంజీవకరణి

సాగుబెట్టింక సంసారచక్రంబు
పట్టనేపట్టను పతి కింటిగోడవ
ఉంఛవృత్తికిఁబోవ నుండువారెవరు
కూసలంగని పెట్టుకొని యింటిలోన
ననివితర్కించుచు నతని యిల్లాలు
శిశువులు క్షుద్బాధచేఁ గళ్ళ యెదుట
నకనకలాడుచుంటను జూడలేక
తపసుచాలించునంతకుఁ గాచియుండి
గద్గదస్వరముతోఁ గన్నీటితోడఁ
బతితోడ నిట్లనిపలికె నొక్కెడను
దయయుంచి మీచూపు దైవంబునుండి
మావైపునకు నుంత మరలింపవలయు
లేదింటిలోన గాలించినప్పటికి
నొక్కనివ్వరిగింజయును గాని పాల
నిచ్చుచిచ్చుచునె గో వెండిపోయినది
యెపుడో కాపుడిగిన విచటివృక్షములు
నిరుటికాలమునాటి నివ్వరియటుకు
లావేళ కావేళ కన్నిన్ని చూపి
ఎటో వెళ్ళఁదీసితి నీనాటివఱకు
జరుగఁబోదిక నొకక్షణకాలమైన
అఱము పట్టిరి వరియన్నంబుకొఱకు
సుతులేడ్చుచుండిరి క్షుద్బాధచేత
నిటులనే యాతపం బిఁకముందుగూడ

సాగించుకొనుచునో చాలించుకొనియో
మిము నమ్ముకొనియున్న మీసతీసుతుల
బ్రతికించుకొనునట్టి భారంబు మీదె.

## ఒ క క న్య

చ॥ చెదరదు సిగ్గుచిన్నె యొకచిన్నమునున్, నును మేను పూచిపూ
యదు తొలిజవ్వనంపుఁబదియారవవన్నె పసిండిపూఁత, ని
ల్వదు చివురాకుమోవి సవిలాసముగా దరహాసలక్ష్మి, నిం
డదు మఱినిండి యింకఁ బదునాల్గవవత్సరమేని లీలకున్.

చ॥ పొడముచునంతలోనడఁగిపోవునుపొంగియుఁబొంగకుండు లే
యెడదను దోరకోరిక లనేకము లెప్పటికప్పు డిప్పుడి
ప్పుడె యుదయంబునుండి విడిపోవుచుఁబోవుచునుండు మంచుకై
వడి మనలీల బాల్య మెడబాయుచుఁబాయుచునుండె దేహమున్.

ఉ॥ పాలవలెన్ బ్రవర్తిలెడిబాల్యము వెచ్చనికోర్కెఁజేసి కా
బోలును పొంగి తోడుకొనఁబోవుచునున్నది నేఁడు శీలపుం
జాలను తక్రధార నిఁక జల్లగఁ దేటెడుజవ్వనంపు మే
ల్మేలినిగారపుందఱకమీగడ యెవ్వనికిన్ లభించునో!

## ఒక సాధ్వి

ఉ. ఆణిమెఱుఁగుముత్తియము లాత్మజులెల్లరుగూడ, నీబహిః
ప్రాణము ప్రాణవల్లభుఁడు ప్రాజ్ఞశిరోమణి దీనబాంధవ
త్రాణపరాయణుండు మధురస్మితపూర్వకభాషి యన్వయో
ద్యానమనోజ్ఞకల్పకము, ధన్యవు పుణ్యవతీసతీమణీ!

ఉ. నీవెఱుఁగంగలేవు జననీ! భవదత్తులనుండి వచ్చు నా
పావనశీతలామృతశుభప్రభచే ద్విగుణీకృతప్రభన్
నీవిభుజీవజీవమణి నిత్యముదుర్దశలం గలంగు దు
ర్జీవుల లేమిచీకటులఁ జిమ్మును పుణ్యవతీసతీమణీ.

ఉ. మేమునివచ్చుచుట్టముకొ మిత్రునికో యొకపూట నింట గం
గామృతమిచ్చునంతకె బయల్పడుచుందుము దీనబాంధవ
స్తోమమురాకకై యెదురుచూచెద రీరలు తల్లిదండ్రులే
నోములునోచి మిమ్ములఁ గనుంగొనిరో కడుపుణ్యదంపతుల్.

## ఒక శిశువు

సీ. ఈరెండలోని పన్నీరపుష్పముకన్న
దివ్యమైన శరీరదీప్తినొసఁగి
పండువెన్నెలలోని ప్రసవాసముకన్నఁ
జల్లనైన వచఃప్రచార మొసఁగి

వియదభ్రభములలోని విద్యుల్లతలకన్న
సొబగైన చుఱుకువాల్చూపు లొసఁగి
మాలతీవనిలోని మలయానిలముకన్న
వాసించునంత పేర్వాసియొసఁగి

తే॥ గీ॥ చిరతరాయుష్య మొసఁగి ప్రాచీనహైంద
వార్యఋషికులసంప్రదాయానుకూల
జీవనసుఖం బొసంగి సుశ్రీ యొసంగి
బాలు రక్షించుగావుత ప్రకృతిమాత.

సీ. మహితసాధ్వీమణీమాణిక్యదర్పణ
స్వచ్ఛమానసవృత్తి స్తన్యమిచ్చి
విశ్వవిశ్వంభరావీరవీరాంగనా
నిర్నిద్రచరితల నిద్రఁబుచ్చి
భరతధాత్రీశ్వరీపరమమంగళగీతి
కాళీరవంబుచే మేలుకొలిపి
ప్రాక్తనార్షమతప్రవృత్తనామోచ్చార
ణంబుచే నుచ్చారణంబు గఱపి

తే. గీ. సహజమగుప్రేమ నమృతహస్తములచేతఁ
బెనుచుకొనుఁ డింక మాధవపిద్దివంశ
మౌక్తికం బైన మీయాకుమారుఁ బాలు
నన్నపూర్ణాహనూమదాఖ్యాకులార!

సీ. ఆకొన్నయపుడు నీవారగించెడునట్టి
మాతృదుగ్ధముకన్న మధుగమగుచు
కడుపునిండినమీఁదఁ గనులమీఁదికివచ్చు
నిదురకన్నను జాల మృదులమగుచు
నిదురమేల్కొనగ సందిటఁబట్టి యాడించు
జననిహస్తముకన్నఁ జలువయగుచు
ఆడించునపుడు నీయలఁతిబుగ్గల నిల్చు
నెలనవ్వుకన్న నిష్కలుషమగుచు

తే. గీ. జిలుగుఁజిలుగుంబలుకు నీదుచిన్నిమోవి
చిగురునందుండి వెలికి విచ్చేయు టెంక
నెపుడెపుడొయంచు బంధుల మెల్లవార
మెదురెదురుచూచుచుంటి మోయికుమార!

ఉ. జీవులనెల్ల దేవుఁడె సృజించెనొ నీవెసృజించియుంటివో
దేవునిఁ దద్రహస్యమెటు తేలదుగాని యిదేమిన్యాయమో
యీ! వచియింపుచుంటివి కవీ! పసునాలుగుగా జగంబు లె
ట్లీవొకరుండవే యెఱిగి తెందుల కిట్టియభూతకల్పనల్.

చ. ఇలఁగల యెల్లమంచితనమే పరమేశ్వరుఁడన్న దానిచేఁ
గలుగుసుఖంబె స్వర్గ మదికానిదియే నరకంబు ప్రాణముల్
వెడలకపూర్వమే యనుభవించును వానిని జీవి భూమిలోఁ
గలిసినమీఁద స్వర్గనరకంబులు జీవికెటుల్ ఘటిల్లెడుఁ.

ఉ. మేమునునీవు మానవులమేగద! యొక్కఁడవీవుమాత్రమే
భూమినివీడి పైకెగిరిపోవవుగా! యొకవేళఁబోవ నీ
భూమికిరావుగా తిరిగి బూటకముల్ వచియించి యింతహం
గామయొనర్ప నేమియసిఘాతము పైఁబడెనీకునోకవీ.

మ. పరలోకంబున దైవమున్నదను విశ్వాసంబుఁబోఁదోలి యీ
నరుఁడే దైవమటంచుఁ దోఁడినరులన్ నమ్మించి దైవంబునే
నరసంతానమొనర్చినావు కడకుఁ రామాయణాంబందు నీ
చరితంబంతయునుం జిదంబరరహస్యంబాయె నోయీకవీ !

శా. ఆదిన్ బింబితమై నరప్రకృతిలో నామీఁద శబ్దార్థమ
ర్యాదన్ వర్తిలి తన్నరప్రకృతినే యంతన్ ద్వమేవాహమై
యీదైవంబు క్రమంబుగాఁ బ్రకృతిపాదాక్రాంతమైపోయె నీ
సోదర్యుండగుమానవుఁ బ్రకృతిరాజుంజేయు మోయీకవీ!

## వి వా హ ము

మ॥ అవినాభావపుఁబ్రేమబంధమున నాయూసూక్ష్మ
సూక్ష్మంపు రే
ణువులుఁ రేణువులేని బిందువులుబిందుల్ సైత మల్పాల్పవా
యువులుఁ వాయువు లెట్టులెట్టులుగ నొండొండైక్యమై
పోవుచు
న్నవియో చూడుఁడి యోవధూవరులు విద్యాబుద్ధిసంపద్ధనుల్!

మ॥ భువి సర్వంబును ప్రేమమూల మికఁ దత్పూర్ణస్థితిన్ వ్యక్తముగ్
ధ్రువమున్ జేయుటకే వివాహమన నిందుగ్ జూపు వైవాహికో
త్సవముగ్ సైతముఁ దద్విలాసమెసుడీ! జంపాల క్రొత్తాన్వయో
ద్భవులారా! కయిసేయుడీ పరమహృద్య ప్రేమ సామ్రాజ్యముగ్!

మ॥ ఒక శ్రీకృష్ణుఁడె సర్వలోకమటు లోనూహించుకొన్నట్టిరా
ధకు శ్రీరామమయంబె లోకముసమస్తంబంచు భావించి జా
నకిగా లక్ష్మిగ గోచరించెను మహానారాయణీ దేవికా
ఇఁక మాబోంట్లహితోక్తి వేడ్కకొఱకయ్యెంగాని యోజింపగన్!

తల్లులు గళమెత్తఁ దములంపుటాకు
చారగన్నడెడు మేచారంబువారు
అడుగ రాకలియైన నన్న మేనియును
ఒకరికష్టముఁజూచి యోర్వనే లేరు
చేలిమీఁదుగఁ బూవె చిదుమగా నైనఁ
జిత్తమొప్పదు మాదు చిన్నితల్లులకు
కసరియే యెఱుగము కళ్ళతో నైన
బెదరించియెఱుఁగ మీబిడ్డలన్ మేము
చిటిపాటిముచ్చటల్ చిన్నితల్లులచే
మఱిమఱిఁజెప్పింప మనసౌనుమాకు
నిముసమే నెడబాసి నిలువనే లేము

అత్తవారింటి కెల్లంపఁగాఁగలమొ
మల్లెలాగు జనించి మరువమల్లెదిగి
చేమంతిరీతిఁ బుష్పించియున్నట్టి
నారాయణీరాధికారత్నములను
రసభోగులైనట్టి రామకృష్ణులకు
అర్పింపఁగలిగితి మతివైభవముగ
సంతానభాగ్యంబు చరితార్థమయ్యెఁ
బాలకన్నను గూడఁ బరిశుద్ధమగుచు
భాసిల్లు మాదు జంపాలవంశమునఁ
బాడమినయట్టి యీపుణ్యపుంజంబు
లిరువంశములఁ దరియింపఁజేసెదరు
అమ్మ! లక్ష్మి! రాధ! అత్తవారైన
క్రొత్తవారన నెంతొ యుత్తమోత్తములు
వరు లింకొకరివంటివార లే కారు
నయవృత్తి దిద్దుకొనఁగ నేర్చువారు
భ్రమరకీటములన్యాయమున మిమ్మిపుడు
క్రొత్తవారుగఁ జేసికొనియున్నవారు
మీరువారేకాని మేమన్ననింక
మాటకైనను బంధుకోటిఁ జేరితిమి
తల్లిదండ్రులు గురుదైవముల్ వారె
పరమాప్తులును సమభాగులుఁ వారె
పయనమైవారితో బంధువర్గముతోఁ
దలపూవువాడక యిలుసేరుఁడమ్మ

అత్తగారగు కోటమాంబపాదముల
నతిభక్తిఁ గన్నుల కద్దికొండమ్మ
ఆడుబిడ్డల కీరు తోడబుట్టువులై
యాత్మార్థ ముందున ట్లలరారుడమ్మ
బావగారల ప్రాభవము గౌరవించి
కులబంధుమర్యాదకును వన్నెవెట్టి
కడుపెదుబిడ్డలంగని యెత్తిపెంచి
వేయేండ్లకును వృద్ధి విలసిల్లుఁడమ్మ.

## నూజివీడు

కం. శ్రీరస్తు వేంకటాద్ర్య
ప్పారాయమహీంద్ర! పట్టభద్ర! శుభం తే
ధీరస్త్వాయుర్బలమ
స్త్వారోగ్యం ప్రాప్నుయాదితో౽ధికవృద్ధిమ్.

మ. తమకారోగ్యమె! బందుగుల్ సుఖులె! మిత్రశ్రేణి కానందమే!
సముఖం బెప్పటియట్టులన్ సుముఖమే! స్వస్థంబె రాజ్యప్రజా
సముదాయం బెపుడో యొకప్డాకని మేషంబేని మీ దివ్యచి
త్తము వర్తించునె యాత్వదాశ్రితునిమీఁదన్ వేంకటాద్రిప్రభూ!

చ. నరవర ఘోరఘోరవిపినంబులు సుందరసుందరంబులౌ
పురులుగ మారిపోయినను పోవగవచ్చునుగాని యొక్కఁడే

వరవడి యేమిచెప్పఁ బరివర్తనమన్నదె లేదు నాకుదు
ర్భరతరజీవనస్థితికి, బాల్యము యౌవనముఁ గతించి పై
కుఱుకగనుండె నిప్పుడు మహోగ్రతరంబగు వార్ధకంబు, వ
త్సరములు మూటికింక నెటుతప్పకు మృత్యువటన్నయాశ మీ
వఱకె గ్రహించియుంట నొకవ్యక్తిమహోదయ నంతదన్క నూ
పిరి బిగబట్టుచోఁ దుడిచివేయుగదా విధి యీప్రపంచపుం
జరితమునుండి, యింతవిరసంబయియున్న మదీయగాథయుం
జెఱసెడిచిత్తవృత్తి నెటులెట్టులొ ముద్దులుమూటగట్టు నా
చిఱుతలమధ్య నీచరమజీవిత మూన యతింతుఁ గాని, యె
త్తెఱఁగున నన్నుఁ బోలు దురదృష్టపుజీవికి నన్నుఁ బోలు పా
పరతున కంతపాటె దశపట్టు, నదేమన విన్నవింతు నీ
శ్వరుపయి నానవెట్టి తమసమ్ముఖమందు, నరేంద్ర! యెన్నియో
తరములవారిగాఁ గనినతల్లివలెన్ మము వత్సరంబు వ
త్సరమును సాకుభూములు వృథా ఋణదాతలఁ జేతఁ జిక్కె, వ
త్సరమునకింతవచ్చునుగదా! మనమింతవ్యయించుకొన్నఁ గా
పురమిటు హాయిగాఁ గడచిపోవుగదా! ఋణబాధలేక వ
త్సరమగుదాక నంచెఱుఁగజాలనితండ్రి యమాయికత్వపుం
బరిణతిచేత నాశిరసుపైఁబడె నప్పటినుండి యెల్ల సం
సరణపుభార మప్పటికిఁ జక్క లిఖింపఁ బఠింప నర్థవై
ఖరి వివరింప సత్కవనకల్పనముఁ బొనరింప నుంత నే
నెఱిఁగినవాఁడనౌట నొకఁడేపనిగా మొఱవెట్ట, నద్దియో
వరమిడినట్లు నాకు బడిపాలకవర్గమొసంగెఁ దెల్గుటీ
చరుపని మత్పురిన్, నెలకొసంగెడిరూపిక లెన్మిదప్పు, డా

ఖరునకు నిర్వదొక్కటి, యిక బనిపాటలకన్న సభ్యులె
ల్లరకును లొంగియుండుట నెల నెలగండముదప్పికొంట దు
ష్కరమయిపోయె,బుద్ధికరుగ నెలయుంబనిజేసి యాపురా
వుడుమన వేతనంబుసరిపుచ్చు కెదో తిరివెట్టి త్రిప్పి క
న్కుటితివడంగనే విఱుగగోసి సగంబునకు సగంబుగ
దిరిపె మొసంగినట్లొసఁగఁ దెచ్చుటకే పయినుండి క్రింది కం
దలు దిగివచ్చువారు ప్రపితామహ ప్రపితామహాదు, లే
విఱుగడగాంచ నెంచి మురిపెంబుగముద్దుగ నెంతొ ప్రేమపుం
బెఱపెఱతోడఁ బెంచుకొనుబిడ్డల నన్ శతథాసహస్రధా
లరయు సతీమణిన్ విడిచి హా! మదిజ్ఞప్తికివచ్చి కంటనీ
రుర లెడిఁ జచ్చి స్వర్గమునయున్నది, నేను పొకాలుచుంటి భూ
నరకమునందునం బ్రదికి,నమ్మి యొయేమొ యసత్యమాడ భూ
వర! యటువంటి మేల్మధురభావయు సంతటి యు త్త
మోత్తమాం

తరపరిశుద్ధ యైన వనితామణి యీకలికాలమందునన్
దొరకుటటన్న దుర్లభము దుర్లభ, మింతటితోడ నాయవాం
తరవిషయంబు నిల్పి ప్రకృతంబునకుం జనుదెంతు, నంత మ
త్పురికిఁ బ్రతీచిగా ననతిదూరమునంగల యొక్కయూర టీ
చరుగఁ బ్రవేశమైతి గుణశాలియుఁ ద్యాగియు భోగి బుద్ధిసా
గరుడు నయార్ణవుండును నిగర్వశిరోమణి సూనృతవ్రత
స్థిరుఁడగు నొక్కకమ్మకుల శేఖరు కోరికపైని నాల్గువ
త్సరముల కాలమచ్చటఁ బ్రశాంతముగా గడచెన్, నిజంబు మ
త్పురికిని దాని కెందునను పోలికయే కనుపట్టఁబోద! సో

దరులును వారు నాకుగృహదానమొనర్చి యెటే నొనర్పనెం
చిరి తమయూరివానిగ, విచిత్రమహో! యొకకొన్ని
కారణాం
తరములచేత నచ్చటిఋణం బిక లేకరుదెంచి యంత టీ
చరునయియుంటిఁ గ్రైస్తవులసాయపుఁగల్మిని రెంటచింతలఁ
బురమున నాలుగేండ్లు పరిపూర్ణముగా, నెలయైనవెంటనే
యఱువది యొక్క మొత్తముగ హస్తగతంబగు,గాని యింటియ
క్కఱలకు రానుబో రయిలుఖర్చులకే సరిపోవు, నిల్వదే
పెఱయును జేతఁ, గ్రైస్తవులబిడ్డలకుఁ దొరసానకచ్చటఁ
నిరతము తెల్గునేర్పుటన నింకుముదంబిడెనాకు, నందులో
దొరల తెలుంగుపల్కుబడితోడి ప్రసంగమటన్న నెంతొసం
బరముగ నుండుచుండెడిది వాస్తవ, మయ్యును శీతపైత్యపుం
జ్వర మటనంటుకొన్న నొకచాయను వీడదు, దానిబారి దె
ప్పరిలుట యెట్టియెట్టి బలవంతులకో ఘటియిల్లు, నావిష
జ్వరముననే హతంబయిరి జాయయునుం జనకుండు పైనినా
చిఱుతలకంటె నాజ్వరము శీఘ్రముగాఁ బనివీడివచ్చి టీ
చరుగనె నే ఫిరంగిపురసంస్థితమా నొకపాఠశాలలో
నిరుడొనరించియుంటినిపనిం, దుదకచ్చట నొక్కవ్యాధి నన్
బోరిగొన నావరింప నొకపుణ్యచికిత్సను మృత్యువక్త్రగ
హ్వరముననుండి బైటఁబడునంతటఁ బెద్దకొమార్తెకొక్క తీ
వరమగు వ్యాధిసంఘటిలె, వైద్యులచేతఁ గుదుర్పఁజేసి యే
కరణినొ చేర్చినాడను సుఖంబుగ నాయమ నామెయింటికి, కె
త్తఱి నసహిష్ణువైన ఋణదాత యొకానొకఁ డెవ్వఁడేని మ

త్వరి నగుపడఁ బైకెగిరిపోవును బ్రాణము లైదు, మీరె యా
దరువను నాశమాత్ర మొక తారవలెన్ హృదయాభ్రవీథిపై
మెఱసి చకచ్చకద్యుతిని మిక్కిలినన్ బురికొల్ప వచ్చి మీ
దరిసెన మాచరించితిని, తగ్గ మనోవ్యథ మీరు మీకృపా
కిరణము లొండొ రెండొ పరగించినఁజాలు, నభాగ్యమెల్ల ను
ద్ధురతరవాతధూతమగు దూదియగున్, బయి వీని మీకవీ
శ్వరునిగ నిల్పుకొన్న యెడ నాగను శాసను సంస్కృతాంధ్రవా
గ్గరిమయుఁ దిక్కయజ్వనుడికారమునుం గవిసార్వభౌమువా
గ్ఝరులఘుమంఘుమంధ్వనుల సాంద్రగభీరతరార్భటీధురం
ధరత పితామహప్రతిపదప్రచురార్థత తిమ్మనార్యువా
క్సరసత రామభద్రుపదజాలమనోజ్ఞత రామకృష్ణుని
ర్భరపదగుంభనార్థరస పాకనిగూఢత మూర్తివాఙ్మయా
మరసువిలాససౌధమతిమద్ధృదయంగమ కావ్యరంగవి
స్తరపరినృత్యదాంధ్రకవితావనితామృదుపాదసంశ్రితా
భరణఝణంఝణంఝణశుభంకరణధ్వనిసుప్రసన్నబం
ధురతయు సూరనార్యుని వినూత్నతరస్వకపోలకల్పనా
నిరుపమభావనాబలవినిర్మితదివ్యకథాప్రబంధసా
గరనిరతోచ్ఛలద్భుగభుగద్రసభావతరంగడోలికా
విరతవిహారసౌఖ్యపదవీపరిపూర్ణతలెల్ల నొక్కచో
గిరకొనుధోరణిన్ నవయుగీయపుభావవిలాసపున్నెఱా
మెఱుఁగున దిద్ది తీర్చి తమ మేటియశోరమణీమణీమహా
త్తరమధురాకృతిన్ బహువిధంబులఁ గావ్యముఖంబునన్ నిరం
తరము వెలార్చి మీమృదుమనంబుఁ బ్రసన్నముగానొనర్తు, దే

వరకొక విన్నపంబొనరుపన్ మనసయ్యెడి, మన్నిసర్గసుం
దరతరదివ్యభవ్యకవితావనితామణికన్ననో స్వయం
వరణము, నాకు నావరణభాగ్యమెలేని కుటీరమందునన్
భరణము, దానికున్నతగుణంబును, నాకుఋణవ్రణంబునుం
జిరవిహితంబులౌకతన శ్లేషయు శోషయుఁ గాంతి క్లాంతి మా
కిరువుర కప్పుడప్పు ఘటియిల్లెడి, శయ్యయొ యామెకున్ మనో
హరమును నాకుమత్కుణమయం, బిఁక నామెకుఁ బాకమెట్టులన్
సురుచియొ నాకునట్లరుచి, జ్యోతివలెన్ వెలుగొంది యామె వా
సరమును వాసరంబును బ్రసాదనిరూఢతఁ జెందుచుండ వా
సరమును వాసరంబును బ్రసాదవిషాదముఁ జెందుచుంటి, వే
గిరముగ నిప్పుడిప్పగిది క్లిష్టసమస్యను మీరలే పరి
ష్కరణమొనర్పఁగాఁ దగు విశాలకృపాధనులంచు వచ్చితిన్
నురుగులుగ్రక్కుచున్, దమయనుగ్రహ మూషయి నా
యదృష్ట మే
మఱచితి నింతలోననొకమాట పువ్వుంబువుగాగ నేర్చి పూ
సరముల నల్లినట్లు కడుఁజాతురి పద్యముపద్యమందు గో
చరమగుచుండ, హాయివెదజల్లెడు చల్లనిపండువెన్నెలన్
మెఱుపు దళుక్కుమన్నకరణిన్ మతిముఖ్యకథాంశమం దవాం
తరవిషయంబు పాఠకుమనం బలరింపగ నాతిదీర్ఘముల్
స్ఫురదురుభావముల్ సులభసుందరముల్ సుమకోమలంబులై
పరగసమాసముల్, గుబగుబధ్వని పొంగులుదేఱ పాలపై
తెరలి మిలన్ మిలన్ మెఱయు తీయనిమీగడలై రసంబునన్
మెఱమెఱలాడ వర్ణనలు, మిక్కిలిమిక్కిలియా శ్రమంబునన్

విరచనఁ జేసి తొల్లి వినిపించితిఁ బోయినవత్సరంబు దే
వరసముఖంబునం దొకప్రబంధము, తత్కృతికన్యకుల్ గవీ
శ్వరులును బట్టభద్రులు రసజ్ఞులు ప్రాజ్ఞులు ధారుణీపురం
దరమకుటాయమానులు వదాన్యశిరోమణు లాశ్రితావన
త్వరితమనస్కు లున్నతపదస్థు లుదారయశస్కు లీరలే
వరులుగనున్న నెల్లకొడువల్ తముతామయి తీఱిపోవె, చే
కుఱనిదియంచు నింక నొకకోరికయుండునె యప్పరాడ్విభూ!

మ. తపసాహాయ్యపుఁగల్మినున్న ఋణబంధంబూడ్చి పూర్వంపుటా
శ్రమమందుల్ దిరుగన్ బ్రవేశమయి సంస్థానంపుటాస్థానరా
జము విద్వత్కవిగాఁగద్యోతిలుఘనాశల్ వచ్చి నానేర్చుచం
దమునన్ విన్నపమాచరించితిని చిత్తంబెట్లొ, విద్వత్ప్రభూ!

శా. అప్పారాయమహీమహేంద్ర! కవియేహస్తంబు లోకసిత్తిన్
దప్పింపన్ నిలుపన్ సమర్థమగుఁ దద్ధస్తంబునే శ్రాద్ధపుం
దొప్పంజేయుచుఁ గూటికై తిరుగు నీదుష్కాలమం దక్షికిన్
జెప్పంబోలుచుఁ బ్రోచువారలొకమీ రేగారె విద్వత్ప్రభుల్!

శా. విప్పారంగడు సిద్ధమైన కవితావృక్షంబు భీష్మంబులై
నిప్పుల్ గ్రక్కు ఋణాలనార్చుకొనిపోనేపోవునో లేకమీ
యొప్పారుంగరుణామృతంబెనసి విద్యోతిల్లునో వేంకటా
ద్ర్యప్పారాయమహీంద్ర! యింతకు మదీయప్రాప్తి యెట్లున్నదో!

మ. మదులుల్ మాన్యములెల్లమున్నె తెగనమ్మంబడ్డవేవేవొయొ
త్తిడులాయప్పులవారొనర్పగఁ దదాదిన్ దారకంబౌచునుం

డెడియుద్యోగముగూడనూడెఁగడువ్యాధిగ్రస్తమైపోయెనా
యొడలీనాటికి, జీవయాత్ర యిక నెట్లో వేంకటాద్రిప్రభూ!

* * * * * *

మ. నిరుడీరోజులలోనె మూలబడి మొండింబడ్డ దీయస్థిపం
జరమింకెప్పటికో విముక్తి పడుకష్టంబన్నఁగష్టంబొకో
నరకంబేనయమబ్బయుబ్బసముకన్నన్ గ్రిందికిన్ మీదికూ
పిరియేయాడని ప్రాణగొడ్డమగు దెబ్బె యెంతరోతయ్యెడిన్!

మ. జ్వరమావచ్చినరాక కింతకునదృష్టంబన్నదట్లుండియా
సరికాలా వెనుకాడెగాని యొక హెచ్చా! బక్కప్రాణంబు ద
గ్గఱలేదేమటె పెద్దబిడ్డయనిలోగాడక్కువడ్డందుకీ
శ్వరుఁడేగాచె నిమిత్తమాత్రములు గావామందులున్
మ్రాకులున్

మ. ఫలమేమీ పడిలేచినిందు కితఁడీపాపిష్ఠుఁడే చూచుకో
వలెనేవేళకునైనలేచి తనకున్ బథ్యంబుఁ బానంబు బి
డ్డలుకన్విప్పరు చెల్లిపోయినది పెండ్లంబెన్నఁడో వెన్కముం
దల నీకష్టమువచ్చెనే యనెడు రక్తస్పర్శ లేదెందులన్.

మ॥ పదిదాకక్కఱలేదుపో కడకు రూప్యంబర్థరూప్యంబె చే
బదులివ్వండొకమిత్రుఁడైన నెదియోప్రాప్తి యుండన్
వలెన్
గదతీర్చంగల డన్నయాసకిఁక మాగ్రామంబునందన్ననా
చదువేమూలకురాదు జీవన మెటుల్ సాగింతు విద్వత్ప్రభూ!

మ. కడకీనాటికిఁగన్న సంతతికిడంగా నాఁడు నాఁడెల్లనే
గడనంజేసినదాన నొక్కపదిరూకల్ లేవు పెండ్లీడుపై

బడియున్నట్టి కొమార్తె లిర్వురును దీప స్తంభముల్ వోలెనా
యెడదంజీల్చుచునున్న వారు తెలువేదీ వేంకటాద్రిప్రభూ!
మ. అడుగేమోపగనీని రోగమున నేనల్లాడుచుం మాయమా
కుడె లేకుండెడు కాపురంబుగడుపన్ గోర్కుల్ శిక్షింటింటికిన్
బడుచుం లేచుచుఁబోవలే కెటులనో బందాడుచుం వచ్చి యి
య్యెడలన్ దేవరవారిపాలఁబడుటాయెన్ వేంకటాద్రిప్రభూ!
మ. తరుణంబందున నీరురానిపొలముల్ ధారాళమౌ వాయువే
కటవైచీకటికోనయౌ గృహము నేకాలంబునుం రావణా
సురుకాష్ఠంబటు లోపలంగుమిలి కొంచుం మందుభార్యాహతా
స్మరణోపద్రవదుర్వ్యథా భరము లస్మజ్జీవితాఘాతముల్.

## ముక్త్యాల

సీ. పసిగాలిచేఁ జిందిపడునట్టి సెలయేటి
నీటిముత్యంబు నీనోటిమాట!
నీటిముత్యంబులో నిలిచి వన్నెలుగుల్కు
నుదయరాగంబు నీహృదయరక్తి!
ఉదయరక్తికి వేచియుండు రమ్యోద్యాన
తరులతల్ నీదు సంస్థానజనులు!
తరులతాదులనుండి తెరలు దివ్యపరీమ
ళంబు మీయావంగడంబు వాసి!
తే. గీ. వాసిగలతేఁడ పీవాటవలనఁగాదె
వాసిరెడ్డ్యుపనామమన్వర్థమయ్యె!

నాశ్రితకవీంద్ర పూర్వపుణ్యస్వరూప
చంద్రమౌళీశ్వర శ్రీప్రసాదభూప.

చ. తిరుపతివేంకటేశకవిధీరులు దివ్యయశోధురంధరుల్
గురువులునాకుఁదత్కృపనె కొంచెముగాఁ గవితాసరస్వతీ
పరిచయమబ్బె యిర్వదికిఁ బైపడనట్టివయస్సునందె నే
తిరిగిగృహంబుఁజేరి యొకతీరు సుతారపుఁగైతమాత్రనే
బిరుసుమగండనై పొడిచివేతుజగంబని యింక నింటిలోఁ
గురియు వరాలవర్షమని గొంతెమకోరిక లెన్నొ కోరి నా
మురిసిననాటిముచ్చటల మోజులనేమనిచెప్పవచ్చు, భూ
వరవర సత్సభాస్థలుల వందలువందలు వేల్ వధానముల్
జరిపినయట్లు లక్షలకొలందిజనుల్ గని మెచ్చి వెండిబం
గరుజలతారుసేలువలఁ గప్పినయట్లు, గజాధిరూఢుగాఁ
బురములఁద్రిప్పిన, ట్లొడల భూషణముల్ దిగవేసినట్లు, సం
బరపడి నాకునేనె తెలవారుటయే తడ వేగి వీధి నే
పుసుగగుపట్టినఁ గదలిపోవగనీయక మద్గురూత్తముల్
తిరుపతివేంకటేశకవిధీరుల పద్యశతంబులెంతొ లా
హిరిగఁబఠించి మేలు బళిరే కడులెస్స సెబాసు భేషు బా
పురెలను బండ్లకెత్తుకొనిపోవుటె కాని కుటుంబపోషణ
స్ఫురణకు మూటగట్టునది పోకయు లేకఁక నిల్లుసేరి రా
తిరి తెలవారుదాఁక మసిదీపసమీపమునందుఁ దొల్త ని
బ్బరముగ నాపయిం గునికిపాటులతోడ ననంతరంబు ని
ద్దురమయికంబుచే నోడలుతూలుటతోఁ బదపద్యపుంబరం
పరలను గిల్కి-గిల్కి సితపత్రము సీరసమూల్య మేనియుఁ

మరలక మానఁబూన నెదిమార్గముదోఁచకయుండఁ దెల్గుటీ
చరుపనిచిక్క గ్రామమున స్థాపితమౌబడిలోన, దానితో
భరముగుకాపురంబు నడుపంబనుపెట్లని నేవిచారసా
గరమున మున్గియుండ, నొకకమ్మకులీనుఁడు పాఠశాలనే
ర్పఱచి స్వకీయగ్రామమునఁ బండితుగానొనరించి నాపయిం
బఱపినప్రేమ మింతయనిపల్కఁగలే, నటనిచ్చునంతపై
దొఱకెడిదద్దియంతయును దూఁబరసేయక మూఁడునాల్గువ
త్సరములఁ గూడబెట్టితిని తత్కృపచే నొక సుంత,...
.................................... దానితో
బురుజులనంటఁగోసె, నిఁకఁ బూర్వపుటాస్తి యొకించుకేని నా
కొఱకు మిగుల్చకుండ మెడఁగోయుఋణంబులఁ బెంచితండ్రి
సంసరణము నప్పగించె, తనుజాతవివాహమొనర్ప డబ్బుక
క్కఱతిఘటిల్లె, నీయఱవగోడును దీర్చగలట్టివారు నా
మొఱవినువారు లేరయిరి, ముఖ్యుల బంధుల నెవ్వరెప్పుడో
చిఱుతతనాన నాకడను శిష్యులుగా నొకయింతవిద్యయుం
గఱచినవారు నాయెడల గౌరవభావముగల్గువార్ కృపా
పరులగుకమ్మవారు నిలువంబడి యెట్టెటో నేకుమారికా
పరిణయముంబొనర్పఁ దగుపాటిసహాయమొనర్చియుంటచేఁ
బరువడిదక్కె, నింక ఋణబాధఁదొలంగునుపాయమెద్ది యే
నరయఁగలేక నాహృదయ మల్లడతల్లడ మందుచుండగా
హారిహారి యింకనేమిపలుకాడఁగలాఁడ! హఠాత్తుగా గృహం
దిరకునునాకునుర్ ఋణముదీఱెఁ, బయింబ్రిదుకంగఁ జాలడే
ప్పరమయి సాహసించి బలవన్మరణంబునకున్నయట్టిము

వ్వరుపసిబిడ్డలేమియయిపోదురో కోయని కొంకియుంటిని
తెలంగునఁబోవకే, కడుపుఁదీపి ఘనంబుగదయ్య! యింతకి
త్తరుణమునందుమీరు తగుద్రవ్యసహాయమొనర్పకున్న చో
జరుగనుజీవయాత్ర, నృపసత్తమ, సత్కవికల్పకద్రుమా!

శా. మొత్తంబున్నఋణంబు ద్వాదశశతంబుల్ మించియుఙ్ మించదా
విత్తం, బంతకునేమిగాని యొకమై వేటాడెదుఙ్ నేశిరం
బెత్తఙ్ బ్రాప్తియెలేనియట్టులుగ రెండేనూఱు లీనాడు మీ
చిత్తంబాపయి నాయదృష్ట మింకసంక్షేపింతు, విద్వత్ప్రభూ!

# దశమాతా హరీతకీ

చ॥ వడివడి నేగి యొక్కతడవన్ మణుగుంగొని తెచ్చి చూర్ణమ
య్యెడునటుగొట్టి యొక్కెడది యెల్లనుగాళనముంబొనర్చి లో
గడనె తదర్థ మేర్పఱచఁగాఁబడియుండిన కుప్పెలెల్ల నిం
డెడునటుపోసి, యప్పుడపుడే పడిపోయినయట్టు లూరిపైఁ
బడి, కలయింటియింటికడపన్ గడపన్ దరిసించి, 'రుగ్ణతం'
బడి యుసులీక మంచమునుబట్టి వటించెడుదీర్ఘ రోగికిన్,
జెడుతిరుగుళ్ళ చేనొడలిచెన్నుతొరంగినయట్టివాని, కె
ప్పుడుకవనంబునల్లుటనొ బుద్ధిపరిశ్రమతోడి యెవ్వొ
గొడవలనో శిరంబడఁచుకొన్నటులై మదిరోసి ప్రాణముల్
సుడివడువానికీయమృతచూర్ణ మమోఘపుటౌషధంబు, నే
నుడువుటగాదు! మీరలిదినొటనొకించుక వేసికొన్న వెం
బడిఁ దెగఁబాఱిమీరెనుడువన్ వలె, జేనెఁడుపొట్టకోసమే
ర్పడినదిగాదు, దానికెటుబట్టిన నట్టులె నారుపోయు దే
వుడు, మఱినీరుపోయక యెపోవఁడు, ముఖ్యముగాగ నేనుచె
ప్పెడునది యెద్ది యోవినుఁడువిందుమహాత్ముఁడుసిద్ధుఁడొక్కరుం
డడవులుకొండలెల్లఁ దిరుగాడి సమస్తములైనరోగముల్
పొడవడగింపఁజాలిన యమూల్యములైన యనేకమూలికల్
వడసి రచించి యొంటినొకపాటున దర్శనమిచ్చి కాష్యులం
బడ దయచేసె దీనికిఁకఁబథ్యముపానము వేళగీళ యం
చెడుగఁగరాద, యింతయనియంత యటన్నియమంబులేద, పో
మొదువఱకెంతయేని యెపుడేనియుఁ బుచ్చుకొనంగనచ్చుఁ, దో

చెడునది నాకొకింతదయసేయగవచ్చు, నటంచునింకనుం
జెడిపడియొట్లతోఁ జెవులుచిల్లులుపోవుసముద్రఘోషతో
బడబడ ఘుర్ఘురించినను పాపమయో యొకఁడైన మందునా
కిడుమనఁడయ్యెఁ, బైన నిహిహీ మన యీ 'తిరువెంగడంబు'చే
సెడునటె వైద్యమం చపహసింపఁదొడంగిరి యెల్లవారలున్,
గడకొకనల్వురైదుగురు కాలము కర్మముమూడి వేడ, నా
తఁడు నెలకీయఁగాఁదగినదాని నొకానొకపూట కిచ్చుచున్
గడుఁగని పెట్టిచూచుచు సుఖంబుగ నెన్నటికేనొకింతయున్
జెడనిపదంబు స్వర్గమునుజేర్చి కృతార్థులజేయఁ, జూచియ
య్యెడఁగలపిన్నపెద్దలు సహింపఁగలేకొకమొత్తమై నలుం
గిడి తలయంటి దేహమునకెల్లనుశుద్ధియొనర్చి యాతనిం
దుడుపులరాయుఁడన్ బిరుమతోఁ దరలింపఁగ సాగి యొక్కశి
ష్యుఁడు చనుత్రోవ లభ్యపడ నూళులఁ బల్లెలఁ బట్టణాలపై
నడరిశతించు కాలయముఁడా యనునట్టుల, నెన్నొ యెన్నొవం
గడముల కొక్కరొక్కరయి కాపునకుందిరుగంగఁబోవు లేఁ
బడుచుఁదనంపుజంటల, శుభంబని నిన్ననొ నేడొ పెండిళుల్
వడుగులొనర్చుకొన్న పసివారల, నెచ్చటనేదియన్నఁ గా
ల్నడకనె పోయిపోయి కనులంబడుపుట్టలకెల్ల సాగిలం
బడిపడి కాలమెంతొగడుపంబడి పున్నెముపండి పాపమే
పొడియొ యొకింతయేరుపడఁబోయెడి మధ్యవయస్సునందునుం
డెడు తడిగల్గుదంపతుల, నేరనియట్టియమాయికప్రజన్,
బెడపెడ రాల్చిరాల్చి, తనివింగొనకెప్పటి, కొక్కయూరనె
వ్వడొయొకరోగియుంట పసివట్టి,తదీయగృహంబుఁ జేరి,యీ

పొడితగిలించుచో నెగిరిపోయి యపూర్వపుటాత్మశాంతి చో
ప్పడునన, నింటిపెద్ద తమపాలికి స్వర్గమునూడిపడ్డ యె
వ్వఁడొ యొకదేవవైద్యుఁ డనుభ్రాంతి మనంబొకయింత తేరగా
నడుగులవ్రాలి లేచి రచితాంజలి, నోయిమహాత్మ! యెందఱో
పొడమి యొకింతగాఁ బెరిగి పోవఁగఁబోవఁగ నేటికొక్క వ్రే
లెడు పసివాఁడె, నాకుమిగిలెన్ గడ, కీతనికిన్ బదేండ్లు పై
బడియెనొ, లేదొ పెట్టుకొనివచ్చెను, వెళ్లె, యథాప్రకారమే
బడికుదయంబునన్, దిరిగివచ్చినపిమ్మటమాత్ర మమ్మనా
యొడలినిబట్టిచూడు మెటులున్నదొ కన్నులుమండుచుండె నొ
చ్చెడిఁదల నొప్పులే మెడలు చేదుగనున్నదిదేమొ నోరు నే
గుడువనెయన్న మింకఁబడుకొందు నటంచును రెండుజాముల
ప్పుడుపడినిన్నఁ బ్రక్కపయిఁ బొర్లి యెఱుంగక నోటిలోపలన్
బడియెడు నీగనే గుఱుతుపట్టగలే కెటులున్నవాఁడొ చూ
డుఁడు, కనిపెట్టి యౌషధ మిడుండనఁ, జూచెడిదేమిలేదు లే
తడయకమీర లీమనసుదర్శనముం దగిలింపుఁ డంతటన్
సడలి సమస్తనాళములు చల్లబడున్ గనుఁడంచు, నీయబో
యెడునెడ శిష్యుఁ డిచ్చుకొనుఁడీ యికఁగాళులవైపుఁబట్ట నా
మెడదెగఁగోసివైచినను మీరలెపట్టవలెంజుడీయనన్
జడిసి గృహస్థిదేమియున సంగతి మీర లెఱుంగనేర రీ
పొడియెఱుకయింతలోపలికిఁ బోవుటయే వ్యవధాన మంతటన్
విడబడు రెండు, వారలును వీరలు రారు విషూచియంచు నె
వ్వడువుననైనఁ గాటి కిఁక వానికి నాకును ప్రమోతతప్ప ద
య్యెడమెడవైపు తాను, గను నేకడవైపుగనుండ, దారికిన్

బాడుగున రెంటితోడఁబరిపూర్ణముగా నభిషేకమా, బయ
ల్పడిమెడుపూతిభూతి, ముకుబ్రద్దలగుట, బడలేనిబాధచే
నుడికి మనంబు గొట్టుకొనుచుంటిని,మీవిషయంబుగాదు,వా
రిడుటకుఁగాని మీరలుగ్రహించి జ్వరార్తిని వేగుబిడ్డకా
పొడినిడఁగాని యడ్డులవముట లవలేశమయేని లేదు, వే
యుడిపొడియన్న, నాగురుదురుద్యమమెల్ల గృహాస్థెజెంగి,యో
వెడగ! యిదేమివైద్యమని వీరలవారలఁబిల్చి యెమ్మకల్
పొడిపొడియానటుల్ నలఁగిపోఁ బొడిపించినమీఁద వానిని
ల్వెడలఁగఁజేసిత్రోసెఁ దనపీటికిఁబై పొలిమేరమేరకున్.

# నిర్వేదము

చ. ఒడలినివంచి పాటుపడకుండినసాగనికాపురమ్ము, పు
ట్టెడుఋణబాధతో నటమటించెడు దుర్భరజీవనమ్ము, ని
ల్కడఁగనకంతలో దుసికిలంబడుచిత్త, మొకండొనర్ప నొ
క్కఁడగుచునుండు, నాజననకాలవిశేష మివెల్లఁగూడి దుం
దుడుకులొనర్చుచుండు నెడ దుస్సహమైనసతీవియోగ మే
ర్పడెఁబయిపాటుగాఁ బిడుగుపాటుగ నుండి నదేమియింకఁజె
ప్పెడి దెదురాటనంబితిరు వెంగడ మూతని నెత్తిగంప యం
దిడినవిపిల్లిపిల్లలు పయిఁదలచెడ్డకొమార్తె వానివెం
బడి నిఁకనామెచేఁగొఱవిపట్టుట వెల్తురుకోస మింతయె
ప్పుడు శుభకార్యముల్ సలుపఁబోవు నెడల్ దెలవాఱివాఱకుం
డెడుసమయంబునన్ వలయునే యివియన్నియు! నింపు
నొక్కఁడొ
క్కఁడె మఱియెంత కేనవుసుగాఁ బుటమార్పగనన్నయట్టులై
యడఁగెను మత్కవిత్వరచనాతిశయంబు సమస్తమిన్నిటన్.

# శంభూ!

మ॥ ఒక తేచాలుగదయ్య యేలుకొన, నీహోదాకటయ్యా యొక
ర్తుకనొంటన్ మఱియొక్క తేన్ శిరసునందున్ గట్టుకొన్నావు యే
లకో! పైగా మెడనిండఁ బాము లొడలెల్లన్ బూదియుంగూడ నీ
మొకమున్ మా మొక మేమిరూపమిది! శంభూ, ప్రేతభూతప్రభూ!

మ. ఒకకొంచెంబుగ నందముండినదొ లేదో దారుకస్త్రీల మ
చ్చిక లేకుండనె వెంబడింతు వెదొపిచ్చింజేసి యానాఁడు, నీ
విఁక నాలా శివమెత్తు టీశునకు నీకే యంతయుండంగ నిం
చుకమాకుండుట యెట్లుదోష మనిపించున్ నీకు శంభయ్యకున్!

మ. అదినీకర్మము మూడుకాళ్ల ముసలయ్యల్ ముండమోపుల్ మొదల్
పెదపెద్దల్ వఱ కెల్లవారలకుఁ గాఫీ లోకమైపోవ నే
మిది యాచాచినచేయి చాచినటుగానే యుంచుకొన్నావిఁకన్
బ్రదుకత్యంతము చేదుమేయుకొఱకేనా! నీకుశంభయ్యకున్!

మ. సరి చేదేవలెనన్న నచ్చుము డికాక్షన్ గాని, నీకట్టుల
క్కఱలే కించుక చేదుచేదుగనన్ గాఫీనొకింతేని శ
ర్కర లేకుండనెయిచ్చునయ్య రరకప్ కప్ కాఫి, యాముండమో
సిరి చేచాచుట కింతతోనయిన స్వస్తింజెప్పి వేంచేసినన్.

## దైవము

సీ॥ వివిధోష్ణవాయుసంభవమహోగ్రిజ్వాల
మాలాకులము సూర్యమండలంబు
ఆమహోగ్రజ్వాల కావలీవలఁబడ్డ
ఖండంబులే గ్రిహామండలములు
పూర్వమందెపుడో యీభువినుండి విడిపోయి
యుండుఖండమె చంద్రిమండలంబు
ఒక్కింతగనెతోచు నొక్కొక్కనక్షత్రి
మండలంబును సూర్యమండలంబె

తే॥ గీ॥ కాని వివిధంబులుగ విభక్తములుగాక
యున్నకాలంబునం దెటనున్నవాడ
వాయనంతాఖిలాండబ్రహ్మాండభాండ
నాయకుఁడవైన యాదినారాయణుఁడవు!

సీ॥ విశ్వమే యావిర్భవించెనో నీనుండి
నీవుగా విశ్వముండెనో మఱేమొ!
విశ్వమంతటను బింబించియే యుంటివో
విశ్వలీనుఁడవు గావింపఁబడితో
విశ్వమే వేళ నిర్విడుటే యెఱుంగదో
యొకటఁ బ్రిత్యేకివై యుందువోటు
విశ్వవిజ్ఞానమే వేదంబు నిను దైవ
మన్నచిహ్నమునఁ బేర్కొన్నదొక్కొ!

తే॥ ఎవరెఱుంగుదు రిందు నేనిట్టులనుంటి
నను కొనుటమైనఁ గలదొ, నీయందు లేదొ!
తలచినకొలందిగా నగాధము నగమ్య
గోచరము దూరదూరమౌ నీచరిత్ర!

సీ॥ నరుఁడు నిత్యము జీవనమునకై యొనరించు
వ్యవసాయ మిష్టదైవమ్ము మాకుఁ
గృషిని సవ్యముగ సాగింపగా నను వైన
భూఖండమే తపోభూమి మాకుఁ
గల పైరుపచ్చలందలి పరాకాష్ఠయే
పంచాగ్నిమధ్యతపంబు మాకు
సలుపుచుండెడు పరిశ్రమనందు లభియించు
ఫలసాయమే మోక్షపదము మాకు

తే. గీ. హెచ్చువడ్డీకి ఋణమిడి హీనమైన
క్రయమునకుఁ బండుపంటనంతయు హరించి
వైచు నీచులె గోముఖవ్యాఘ్రములును
సాధునరరూపఘోరరాక్షసులు మాకు.

## ఆత్మకథ నుండి

మ. పనికిం బాటకు నెంతొ ముచ్చటపడున్ బాకంబుచిత్రించునుం
డినసంబారముతోడఁ బ్రత్యుదయమందే లేచి యిల్ దిద్దితీ
ర్చును నద్దంబటు నీళ్ళఁదీసినటులుంచున్ గన్నసంతానమున్
దనయాదాయ మతిక్రమించనటు పొత్తాయించు ఖర్చంతయున్.

మ. నెలకుం బెన్మిటి తెచ్చునట్టిపదితోనే వెళ్లఁబుచ్చన్ వలెన్
గలసంసారపుఖర్చు చుట్టమనిపక్కంబంచురా నుప్పునుం
బులుసైనం దినిపించిపంపవలె నల్వుర్ వోలె సంవత్సరా
దుల సంక్రాంతులనైన బిడ్డలకు నేదో చేసిపెట్టన్ వలెన్.

మ. సకలంబానిది యొక్కయాపదిని పోచాయించి యందించుకొం
చుకగాగన్ మిగిలించుచున్ నెలనెలన్ జుట్టాలకట్నాలకో
యిఁక నేదోయొకదానికో యతఁడు లేదేయన్నయప్డెల్లఁ జే
తికినందిచ్చును వ్రేళులం బరుసవేదిం గల్గియున్నట్టులన్.

మ. అనుకూలాచరణంబుగల్గిన స్వభార్యాయాజమాన్యంబు బొ
డ్డునమాణిక్యముతోడఁబుట్టినప్రభుండున్ గాంచలేనంతహా
యిని గల్పించుటచేఁ బురాతనగృహంబే భూతలస్వర్గమ
య్యెను నెల్లెగుచునున్నదో తెలియదామెన్ గాలమవ్వానికిన్.

తే. గీ. అక్క లటులిర్వురును జెలియండ్రు నల్వు
రిటులగలపుట్టినింటఁ గామేశ్వరమ్మ
పెరిగినదిగాన నిట నాడుబిడ్డలందు
నేకమగుటకుఁ గష్టమే లేకపోయె.

తే. గీ. కొడుకుగాఁ గూతురుగఁ జూచుకొనెడునట్టి
యొక్కరుక్మిణియే వారికున్నబిడ్డ
యిప్పటికి నామె యిపుడిప్పుడే యొకింత
పాఠశాలకుఁబోవ నభ్యాసపడియె.

చ. ఎది కొని పెట్టుమం చడుగ దెన్నడునుం గొనియీయ వల్లునా
కిడియన దేమిచెప్పఁ బొరుగింటికె యాడుకొనంగ నైనఁబో
వదు పెఱబిడ్డతోడిసహవాసమె కాదు ప్రమేయమన్న దే
మొదలనరాదు తత్ప్రకృతిమో స్తరదో యిదిగాఁగనంబడున్.

చ. చదువనఁ గాకినక్కకథసంగతియేయనుకొంచుఁ దత్కథన్
మొదలిడిచెప్ప, సారెకొకమో స్తరుగా నిఁకఁదాతగూడఁ దా
నదివఱకెన్నఁడున్ విననియట్లువినుం జెవులిచ్చి, కాననే
కుదిరెను వారికిన్ దగనికూర్మియుఁ బేర్మి దినక్రమంబుగన్.

చ. గురువయి తన్నులోఁబఱుచుకొనొకఁడుండుటెగాక
తాను లోఁ
బఱుచుకొనంగ శిష్యుఁడగువాఁడొకఁడుంగలఁడంచు నామె సం
బరపడుచున్ బడిన్ విడిచివచ్చుటయేతడ వింకఁదాతకున్
గఱపును నోనమాల్ మొదలుగాఁ గలబల్లయిదున్ గుణిం
తమున్.

తే. గీ. ఒకరు పైవేయు స్తోత్రమాలికలకన్న
మాటికిని వచ్చి పైఁబడి మనుమరాలు
చదువెరాదని చేయుహాస్యంబులోని
యాత్మమాధుర్యమే వాని కభిరుచించు.

తే. గీ. జరిగె నీలోనఁ దండ్రికీవఱకొసంగు
జీతమించుక యభివృద్ధిఁ జెందుటయును
చంటిచెల్లెలుగానొక్క 'జాతిబొమ్మ'
నిరుటిసంక్రాంతి నింట జన్మించుటయును.

తే. గీ. శాంతముగసాగు వారిసంసారయాత్ర
యందొకటివచ్చి కామేశ్వరమ్మమదిని
పీటఁబెట్టిన దిప్పు డాభీతిఁగూర్చి
యప్పుడప్పుడు భర్తతో నిట్టు లాడఁదొడఁగు.

తే. గీ. ఒకటిరెండేండ్లలోఁ దప్పకుండనొకరి
చేతిలోఁబెట్టు నీడువచ్చినది బిడ్డ
కెట్టులోగద యీభార మీయొకింత
తీఱె నల్వురలోనింకఁ దిరిగిపడుట!

మ. అటుపైసుందరరామశాస్త్రి యిదియాహా! బాగుగానున్నద
న్నిటికన్నన్ మనబిడ్డకింతకుఁబదేనీ పూర్తిగానిండ వి
ఘటముల్ దిన్నగనుండి దైవముదిచక్కన్ జూచుచో నింకనె
ప్పటికే నాల్గయిదేండ్లముచ్చటకొ యిష్టాయిన్నియాలోచనల్.

మ. పయిగానీయెడనున్నబాధ్యతను నీపైబడ్డభారంబుగా
భయమేదోకొని తెచ్చిపెట్టుకొని యాపైనన్ను బాధింతువే
నయమే పెండ్లియనంగనే మొయనుకొన్నావీవు నూరేండ్లపం
టయె వేయేఁడులసంగ్రహంబనుట వింటన్ లేదెనీవెందులన్.

మ. మనకీనాటికినున్నయాస్తియనగా మాగానినూఱైదుసెం
ట్లును నిల్లేగద, యప్పుక్రింద నివిరెండుంగూడ నూరేగవ

చ్చును లేదా యొకడిందులో మిగులవచ్చుఁ జీవనాధారముల్
మనకుద్యోగము తల్లిదండ్రులకు నామూఁగాని సెంట్లేగదా.
శా. ఆయుద్యోగముమీఁదిరాబడి కుటుంబాధారమౌనంతకే
చేయంగాఁ గలవిన్నపంబులకు సంసిద్ధంబుగానుండగా
నీయాయక్కఱనెట్లుదీర్పగల దెంతే లేదు లేదన్న నే
వేయోలేకిది వెళ్ళఁబుచ్చెడి తలంపే పెట్టరాదెట్టులన్
చ. అవియెటులంగడించుటని యాత్మగలంగుచునుండె రేళులుం
బవళులు కానిచింతపలిపాటినివాసియొకండు చాలనె
క్కువ'బలవంతపెట్టెఁ' గొఁడుకుంజదివింపుమటంచునన్ను నీ
యవసరమెల్లదీర్చుకొన నంపుఁబ్రయత్నమొనర్చిచూచెదన్.
చ. అనియనుచుండెగాని యతఁడా మొగదల్చినయప్పు డెంతయున్
జన కొకకొంత కాలహరణంబొనరించినమీఁద రంపురం
డనుచును వెంటవెంటఁ గబురంపగ నచ్చటిసాహుకారు త
ప్పనిసరియయ్యెనాతనికి స్వస్థలమున్ విడఁగష్టమేరికిన్!
చ. అదియొకపల్లెటూరయిన నందలికమ్మటికాన నూటికే
పదుగురొకాని యందఱును బాగుగనుండినవారె వారికిన్
జదువునకన్నఁ గాపురపుసంగతులే మిగులన్ రుచించు నా
యిదినె గృహంబునుం గృహము నెంతయుశాంతినొయిన్
ప్రవర్తిలున్.

తే. గీ. ఎవరి కేకష్టమెదొ వచ్చెనేని వార
లెల్లరును మూగుచుండు రుసిళ్లతెరగఁ
బనులరోజులఁ జేలలోపలనె యుండ్రు
పిట్టపురుగైన నూరఁ గన్పింపకుండ.

చ. ఒకరికొసంగుటే యెఱిఁగి యొక్కరినుండి గ్రహించుటే యెఱుం
గక తమకష్టముందినఁగఁ గాచుకయుండుసమస్తజీవరా
శికిఁ దమతోడఁబంచియిడి జీవనముంగలిగించు వారిదే
యికసుకృతంబనంగ మఱియేదో యనంగఁ దలంచిచూడగన్.

మ. పొలమేదున్నటచేతఁగాని మనతూర్పుంబ్రక్కమేచారపు
న్నలుసేనచ్చుటలేదు, వీథినిపురాణంబైన నేపగ్గమో
పలుపో వేయకయూరకేవినరు, గొప్పల్ కొద్దు లేమంతవా
రలకుంబట్టవు, వ్యాజ్యమాడఁ బొలిమేరన్ దాటిపోరెవ్వరున్.

మ. సరికానీ తరవాణిపచ్చడులతో సంబారుకారంబుతో
వరిగల్ సజ్జలు జొన్నలేతినెడి యవ్వా రుక్కుకడ్డీలవై
ఖరిగానుండగఁ బూట కొక్కతరహాగా నెంతపట్టించినన్
మెఱుఁగేకాని బలంబుపట్టదసలేమీ తూరుపాసామికిన్.

మ. చెమటందీతురువారు తిన్నదెదియో జీర్ణింపఁగాఁ దీతదీ
తుము చెక్కుంజెమరింపనీముమనమాదోకంబలెన్ శక్తిస
న్నముగాఁజొచ్చెను పోనుపో నచటికన్నన్ నిచ్చెనల్ ముందెవే
తుమిటన్ వెంపలిచెట్లకంచనెడు గుర్తుల్ దోచు నెన్నేనియున్.

మ. వరియన్నంబనియన్నఁ బండుగను పబ్బంబందునన్ దక్క ము
ట్టరు వారంతగఁ బూటకింకనొకపూటందిన్నచోఁ జేనిచా
కిరియే చేయఁగలేనెలేరట యశక్తిం జేసి మాతూరుపుం
దొర లెల్లప్పుడుదాని నేతినుటలేదో! యేమివిడ్డూరమో!

మ. చలువంజేసినవస్త్రమే యచటియాసాముల్ మహామేరువుం
బలె భావించుచునుండగా నిచటివా రమ్మద్రాసుబాంబేలలో

పలియుస్త్రీయు దిసింపకే కనులకున్ ప్యారిసులండన్లత్రో
వలఁబాటింతురుచూ పెటుల్ గుదురు సాపత్న్యంబు వార్వేరికిన్.

మ. గదినిండన్ లవుసీనులుండవలెఁ బ్రక్కన్ బై కికన్ సిల్కె త
ప్ప దదో పోజట యుత్తపుణ్యాముకె సోఫా నాపసోపాలు చె
ప్పెద నింకేమని మాటిమాటికిని కాఫీటీలకై కోళ్లు లు
న్న దెపూర్వంబున నింతదుర్వ్యయము నల్పాయుష్యవిరా
తూర్ష్ణసన్.

మ. పురమాయింపుగఁ ద్రాళ్ళుపగ్గములు పల్పుల్ వేయగాఁ
జాలు వం
కరపోకుండగ నాగలిన్ నడుపఁ బ్రజ్ఞావంతులేగాని పో
కరురమ్యాసులదాక నెందులకుఁ జేకన్ రంగులెన్నున్నవో
యెఱుఁగన్నేరరు వార లిప్పటికి నేసి యెంతదౌర్భాగ్యులో.

మ. ధరమందంబో ప్రియంబో పైరులెటుతత్కాలంబునందున్నవో
సరు కేదెవ్వరియొద్ద నెంతగలదో సర్కారుసిస్తెప్పుడో
కరణంబున్ మునిసీఫులేమికథగా గ్రామాన వర్తింత్రో యా
తతహాగానడచున్ గబుర్లితర వార్తల్ దూఱఁబో వాచెవిన్.

శా. హేలన్ నెత్తికి నేలకున్ మనము బ్రాహ్మీవిశ్వనాథాదులన్
లీలన్ గుడ్డకుగోచికెల్లరము లాలీపాప్సు ప్యారిసుకి
క్కీలీలక్కులవాడి క్రొత్తలకుఁ ద్రొక్కళ్ళకు చిల్లింతగా
డోలాందోళనమొంద వారెఱుఁగ రోటోదిల్ బహారేనియున్.

మ. సరిగాదస్కితె చేతఁగానిక్షపితల్ సన్నాసులుంగూడ పా
ర్కరుడ్యాఫోల్డిటు జేబులందిడగ లెక్కుండొక్కనెన్నేనియున్

దిరుగుళ్లందిగ్రద్రావఁగాఁగల ముసద్దీలేని యచ్చోటవా
టరుమార్గ ఫౌంటెను పేరునైన వినియుండంబోవ రీనాటికిన్.

తే. గీ. ఇంక నచ్చటి షాహుకా రేదియన్న
నదియె తీర్మాన మాయూర నందఱకును
నరిది యంత హిరణ్యవృద్ధయ్యె నంత
వినయభూషణుఁడును సువివేకి యగుట.

మ. ఉదయస్నానము సంధ్యతీర్చుమబురాణోక్త ప్రకారంబుగాఁ
జదువుల్ గీతలఁ బాఱఁజూచుఁగవిలెన్ జాలన్ బరాకాష్ఠగా
గదలున్ సత్రము వైపు పండితులతోఁ గావించుసంభాషణల్
పదికిల్ చేరుక యారగించునతఁడా పై యిష్టమృష్టాన్నముల్

చ. కదురుధరించుమాటతోఁ ఇుకఁడుకుటుంబపుఖర్చు మొత్తముల్
బొదుపునఁబట్టియుంచుఁ దనపోబడిరాబడులందు నెంతయున్
బదిలమునం బ్రవర్తిలును బ్రస్తుతముల్ వివరించుఁ దేటగన్
మదుగఱలేకయున్ దణుకుమాచవరంబటుగాక సూటిగన్.

మ. తనఖాప్రాంసెరినోట్లరూపమున మొత్తంబెంత లేదన్న ల
క్షనుమించంగల దున్నపెట్టుబడి యాసామీలలో నెవ్వరా
యనబాకీమెగవేయ రెన్నఁడును న్యాయ్యంబైన వడ్డీకె యె
వ్వని కేనిచ్చినఁగాని లేదుసుమి కంప్లైంటన్నదానాటికిన్.

మ. పదులున్ వందలు వేలు నప్పుగొనుచున్ బద్దైన లేకుండనే
పదిలంబౌగతి బూవులంబోదిగి యాపైకంబుఁ జెల్లింతు ర
ల్లదిగోయన్నదియాఱుమాసములపర్యంతంబుగాఁబోయినన్
మొదలేమున్నదెఱుంగఁ డిప్పటికి నెప్డోవచ్చు నట్టింటికిన్.

# చాటువులు

తే. గీ. మాయమైపోయె స్వచ్ఛందమరణ మెపుడొ
దివ్యదృష్టి నశించె సోదెకును రాక
వినమికఁ బరకాయప్రవేశ మనుటె
యెంత కెంతగ మారిపోయినది జాతి.

సీ. ఇటులటుల్ దిరుగాడ నేఫోర్డుమోటారో
గడపపచ్చనకు నేగ్రామఫోనో
అందంబుజూడ నేహాలండునద్దమో
చిత్తంబిఁగుర్వ నేక్రొత్తఫిల్మో
ఎన్నికంగనఁగ నేటెన్నిసుపందెమో
గొప్పగన్పింప నేగోల్డుఫ్లేకొ
కాలంబుగడుప నేక్లబ్బుమెంబరుషిప్పొ
యింతయుఁ గడువ నేవింతఫరమొ

తే. గీ. కలిగినంజాలు నున్న బంగారమెల్ల
నమెరికా ఫ్రాన్సు బ్రిటను దేశములు దోచి
దాచుకొన నేమి లే, కాకితపుఁగరెన్సి
బలిసియున్నది మనకుఁ గావలసినంత!

మ. కనులంజూడదు భార్యయేనియును నీకాలస్థితింబట్టి జ
ర్మను తైలంబు జపానుసబ్బమెరికాక్రాపుఁ వియన్నాసులో
చనముల్ స్వీడనుచేతిబెత్తమును స్విర్జర్లెండురిస్టువాచి ఫా
రెనుడ్రెస్ ఫ్రెంచికటింగుమీసలును ప్యారీస్ఫాష నేలేనిచో.

సీ. బంగాళిబాబుదోవతికట్టు సేలము
యయ్యంగారి యుత్తరీయంపుమడత
సెల్యులాయిడ్ ఫ్రేము స్పెక్టిల్సాఫుఫుల్
స్లిప్పర్సు టార్పెడోషేప్డుపెన్ను
వైటుకళ్ళీషర్టు వన్నెహాండ్‌కర్చీఫు
రీమోడలుకటింగు రిస్టువాచి
వాకింగుస్టిక్కు నంబరులైటుస్మాల్ సిక్సు
పెన్నీసవల గోల్డుఫేకో సిజరో

తే. గీ. లేనివాఁ డుండియునుగూడ లేనివాఁడె
యున్నవాఁ డేమిలేకయు నున్నవాఁడె
ప్లీడరైన నెంతటి గొప్పలీడరైన
డాక్టరైనఁ గొమ్ములుదిర్గు యాక్టరైన.

సీ. వస్తులన్నియును దిండుగలీబుఁ లేగాని
జాత్యలంకారసౌష్ఠవము లేదు
ప్రబలసంసారతాపత్రయంబేకాని
తిన్నఁగాఁ గన్నులు దెరువలేఁడు
కాపురంబనుపేరెగాని యాతని గృహం
బదియరాజకకూట మన్నఁ జాలు
నిగ జీవనము సర్వము గతానుగతికమై
యుండిన నేవాని కునికి గలదు

తే. గీ. నడక కొాక చందమని లేదు పడుకటిల్లొా
కాకయుండినఁ జనువులగదియొ లేక

రబ్బిషుంగొట్టొ యెదియొ నిర్ణయముగాదు
భారతీయుని నిజగృహాభ్యంతరంబు.

సీ. జంతుధర్మంబైన సరిగ నిర్వర్తింపఁ
బడదు ప్రాయికముగాఁ బ్రతిగృహమున
బడల శక్తియటంచు నుండినంగద స్వ
ధర్మమునకుం దగురక్షణముఘటిల్లుఁ
గర్మభూమియటన్న గర్వమేకాని య
త్యధికంబు కులటాజనాభివృద్ధి
యొకసంఘముకొ కులంబుకొ చెంద కెంతకా
లము వారు బైటనిల్వంగలారు

తే. గీ. కలుఁగుసంతానమునకు నెక్కడశరణ్య
మనునదే లేక వార లల్లాడుచుంట
యూరకే పోదు వారలయుసురుదగిలి
యింతకింతగఁ గ్రుంగిపో యెదము మనము.

సీ. బహుళమైనట్టి యుత్పత్తితోఁగూడనే
సర్వతోముఖవినాశము ఘటిల్లె
సమధికంబైన యైశ్వర్యంబుమధ్యనే
గర్భదారిద్ర్యాంధకార మలమె
మితిలేని యంత్రసమృద్ధియందుననె ని
రుద్యోగవిషయ మాహాకమయ్యె
సంధిపత్రంబుల శాంతిభద్రతలందె
దుర్భరవైర మావిర్భవించె

తే. గీ. ఫణములెత్తెను దుర్విషఫణులలీల
టారిఫు లవే కరాళదంష్ట్రలనుజూపె
దగ్ధమైపోవు నింకమీఁదటఁ బ్రపంచ
మార్థికపువైపరీత్యవిషాగ్నిశిఖల.

సీ. మునుపటింబలె గ్రామములు పట్టణములఁబో
షింపలేనంత దుస్థితికి వచ్చెఁ
బట్టణంబులు వానిపై భారపడకుండ
నిజశక్తితో నిల్వనేరకుండెఁ
బల్లెటూళులతోటిబాటుగాఁ బరపతుల్
పట్టణంబులును గోల్పడఁదొడంగెఁ
పేరుచెందిన పెద్దపెద్దప్లీడర్లకే
నెలవెళ్ల నూటేండ్లు నిండుచుండె

తే. గీ. వృత్తులన్నియు నంతరించెను గ్రమముగ
వత్తిలోఁ జమురట్లు రైతెత్తువడియె
సెంటుచే నెకరంబు కంచియ యటన్న
సామెతగ నింటికెక్కువ సాదరమ్యె.

సీ. డాలరుంగూర్చి యాందోళనంబని లేక
ఫ్రాంకుగూర్చి విచారపడుట లేక
పౌండుకోసము తలపట్లుపట్టుట లేక
యెన్నుకోసర మెత్తు నెత్తై లేక
వలసలే లేవని వలపోతలును లేక
క్రొత్తక్రొత్తలఁ గనుంగొనుటె లేక

యంత్రనిర్మాణ వ్యయప్రయాసలు లేక
ఇటులుంటిమే యను నెఱుక లేక

తే. గీ. పార్కులందుఁ బ్రదర్శింపఁబడు నరణ్య
జంతుతతివోలె భారతజాతిగూడఁ
దా మిగిలియున్న యది ప్రాచ్యతత్త్వవిదులొ
నర్చు పరిశీలనార్థ మీనాటికేని.

సీ॥ ఋణదాత లంగీకరింప రేమాత్రంబు
పెట్టినట్టిఋణంబుఁ గొట్టివేయఁ
బ్రకృతమందు ఋణస్థులకు సమర్థత లేదు
నగదుచెల్లించి ఋణంబుదీర్ప
నుభయులమధ్య నేదోసంధిపొసగించు
నధికారమని కోర్టుకసలె లేదు
ఏది తప్పినఁ దప్ప దెట్లుగ బ్రభుత్వంబు
వారి తాతాచార్లగారి ముద్ర

తే. గీ. దేశమంతట నీపరిస్థితిజనించి
బలుపువాపులకథ బైటఁబడియెగాని
కష్టపరిహారమునకు మార్గంబుమాత్ర
మెఱుకపడ దెట్టులున్నదో యీశ్వరేచ్ఛ!

సీ. చిన్నడిస్ట్రిక్టుమున్సిఫు కోర్టుఫైలంత
డిక్రీలకట్ట డిశికట్టలగును
సివిలుకోర్టును రిజస్ట్రేషనాఫీసు తా
లూకాకచేరీల లోకమిఁకను

అప్పుపుట్టదు వ్యాజ్యమాడ బ్యాంకుల డిపా
జిట్లలో లేదొక్కచిల్లిగవ్వ
ఊరకొందమటన్న నున్న నాలుగునోట్లు
కాలదోషమున మంగళముఁబాడు

తే. గీ. చేతికేమియు వచ్చిచచ్చెడిదెలేని
కవిలెకుం దోడుగా షాహుకారుపన్ను
వేలుగలవారమను సంబరాలె గాని
కాపురం బీదుటయె 'కనాకష్ట'మయ్యె.

సీ. ప్రకృతకాలమున జాతికిజాతికినిమధ్య
జరుగుసంఘర్షణస్పర్ధలైన
దేశమ్ముఁ దేశ మార్థికవిప్లవమునుండి
తప్పికోఁ సలుపు తంత్రంబులైనఁ
దోడిజపాను ముందుకుసాగి సరుకుతో
నింగ్లండునే ముంచియెత్తులైనఁ
ప్రతిరాజ్యమును ప్రతిప్రాంతంబుప్రక్కప్ర
క్కలవేయు టారిఫు కంచెలైనఁ

తే. గీ. గొంచెమెఱుఁగక తప్పించుకొనితిరుగుచె
జాతిజీవనచరమలక్ష్యంబుగాగ
యెటులెటులొ పోవ మిగిలిన దెడపదడప
నేలవదలించెదవ్వ స్టూడియోలు పెట్టి!

సీ. బహువిధయజ్ఞార్థపక్వపురోడాశ
పుణ్యపరీమళాపూరితములు

ప్రబలనైష్ఠికగృహారబ్ధదివ్యామృత
చరుచారుగంధప్రసారకములు
అనవరతావ్యాహతాజ్యధారాహుతి
శిఖిశిఖాహుంకారముఖరితములు
శ్రవణగృహీతవషట్కారవాచాల
నికటవృక్షావాసశుకకులములు
గీ. పావనాశ్రమములు దృష్టిపథమునుండి
స్మృతిపథమునుండి జాఱిపోయినవిగాని
పొడుచుకొనివచ్చినవి కుక్కగొడుగులట్లు
స్టూడియోలెన్నొ స్థలభాండశుద్ధికొఱకు

మ. మును వేషంబెదొ వేసినాఁ డనుటలో మోసంబు గావించినా
డని యర్థంబు స్ఫురించుచుండెడిది, యాహా! యిప్పుడవ్వేసమే
ఘనమైపోయెను వేషమొప్పి తగు రాగజ్ఞానముం గంఠముం
డినచో బ్రహ్మరథోత్సవం బెడిగదు ద్వేయెంతయుద్యోగముల్!

సీ. గోహారు తళుతళుక్కుం జూపుగలవారు
శశివంటి కిన్నరస్వరమువారు
దేవిక తీర్చిదిద్దిన కన్బొమలవారు
నళినంత తీయదనంబువారు
సవితగ్రేసును ఠీవి నవఘుళించెడివారు
వాసంతి చిఱునవ్వు వన్నెవారు
మిస్ సులోచనతల మిగులు నందమువారు
యాప్టెకన్నను జాణలైనవారు

తే. గీ. కలుగకేపోరు రూపరేఖల నెగాదు
తెలుఁగువా రెవ్వరికి నెందుఁ దీసిపోవ
రింతకున్ దేవకీబోసు శాంతరాము
లంత డైరక్టరులె మ్యాగ్స్యలెరిగాని!

మ. మనకుంజేతడియాడుచో నొక సినిమాహాలుఁగట్టించి యు
ద్దెనురాబట్టుటె లాభదాయకము కాదేనప్పుసొప్పిందొపు
ట్టినదే వర్తకమో నయం బదియుఁ గీడేయెంచుమై వల్లద
ప్పినదేమున్నది తారకంబికను కాఫీహోటలో హోటలో!

మ. మిగిలెన్ గర్మముచాలకించుకగనే మేన్ జెడ్డ నేదమ్మిడీ
నగరున్ రానివిదేశవర్తకుల నానావస్తులింటింట మా
నగరానంతగనొంటఁబట్టినవి హుణాప్రక్రియల్ ఫ్యాక్టరీ
పొగగొట్టంబుల లేచిపోయినవి యెడ్డో వెండిబంగారముల్!

శా. ఆయాపల్లెలలోన నిత్య నియతంబై రచ్చకొట్టంబులన్
సాయంకాలమునన్ బ్రవర్తిలు పురాణగ్రంథపారాయణ
స్వీయామూల్యపవిత్రవీరచరితప్రేమాభిమానంబులే
మాయంబైనవి కొంతకాలమునకామాటైన లేకుండెడిన్.

మ. ఇలువాకిళ్ళ నొకళ్ళకమ్ముకొని బి ఏ లైనమాత్రంబునన్
ఫలమేమీ కులమొంతతక్కువయొలాభం బంత హెచ్చిప్పుడా
దళమున్ వేసుకపుట్టినట్టి సుమహాత్మశ్రేణి కుద్యోగముల్
సులుసూత్రంబులు కోరకుండ దిగివచ్చున్ గొండపైనుండియున్.

మ. ఉదయం బస్తమయంబునుండి దినము నేయుద్యోగిచుట్టోపదిం
బది నశ్వత్థప్రదక్షిణల్ సలిపి సంప్రార్థించిప్రార్థించియున్

దుదకున్ బ్రాహ్మణపట్టభద్రులు నిరుద్యోగంబుతో నెందఱో
పదులున్ వందలు వేలు నేఁడు సఫరై పాడైరి యింగ్లీషునన్.

మ. భృగువీమాత్రములోనికిందిగియె బి ఏ నంచు భీష్మించుచో
నిగనుద్యోగముమాటటుండ నొకయింతేనుప్పుగల్లైనఁ బు
ట్టగతుల్ లేనియుగంబువచ్చె నిటులింటన్ మ్రగ్గుటో లేకటుల్
తెగి యేవృత్తికినో జొరంబడుటొ తేలెన్ దేటతెల్లంబుగన్.

మ. ఘనమోనీచమొ జీవనంబు గడుపంగాఁ బల్లెకూటంబుఁ బె
ట్టినచోఁ గానులుకాలగిద్దలును వడ్డీలెక్కలున్ రావలెన్
దెనుగం దంతటి మాటకేమిటికిగానీ పెద్దయెక్కంబులై
ననురావాయెను పాపమెంత యవమానంబయ్యె బి ఏ యనన్.

సీ. అమెరికా కధ్యక్షుఁడగు రూజువెల్టుకుఁ
బొట్టకోసర మొక రొట్టెగాని
సకల భారతనియంతకు గాంధి కేనియు
వేళకిన్నియె మేకపాలుగాని
అంతటి డిక్టేటరయిన హిట్లరునకు
భోజనంబునకుఁ గాబేజెగాని
అంతకన్నను గూడ నధికుఁడౌ ముసులోనీ
గ్రాసంబునకు టొమాటో సెగాని

తే. గీ. పనియుఁ బాటయు లేకూరగ భైరవుఁడుగఁ
దిరుగు సోమరిపోతు కీదేశమందుఁ
దీరుతీరుల యెన్నెన్ని తీయములును
ఆటిరా వొక్కపూట సాపాటుకేని

సీ. తేపకొక్కరివైపు తిరిగి పోవుచునుండుఁ
బోకరాటనువచ్చు జోకరట్లు
నమ్మినకొంప గుండము వేయు పైయాసుఁ
దుడుచు నాఖరు చేతి తురుపులాగు
తనయాసఁజూపుఁ బాతాళంబులోనికిం
దెగిపోవుముక్క గుర్తించుకరణి
నితరునియవసరం బింక నెంతకును ఫి
ట్టరుగాని రమ్మీసు వరుసఁజేయు

తే. గీ. నెవనిపక్షము నెగ్గిన నేమి చిట్ట
చివర కిస్పేటుజాకిగా సిద్ధపడును,
కోటి మహిరావణులుగూడ దీటుగారు
నేటినవనాగరకు కొనగోటి కేని!

సీ. ప్యారీసు క్రీలవు ప్రాపగాండావారు
లండను వ్యవహారకాండవారు
మాస్కో విడాకుల మంత్రాంగములవారు
బెర్లిను పెనుబీరు పిచ్చువారు
హాలివుడ్ న్యూఫిల్ము నాందోళనలవారు
రోము నానావిధరుచులవారు
అరబిక్కు దేశచాంద్రాయణంబులవారు
నెస్కిమో కొంగయింత హెచ్చువారు

తే. గీ. నాడునాటికి మేవెట్టు నాడియాల
నగ్నసౌందర్య మాత్మను నాటినాటి

తిరిగి సృష్ట్యాదికరుగ యత్నించువారు
నేటి నవనాగరకులలో మేటివారు.

సీ. కుంభవృష్టిగఁ బాలుగురిసెడి యతిబలి
ష్ఠం బైనయట్టి హిస్సారుజాతి
పిలిచివిడుచునూపిరినె సంగీతంబు
తీరుగావించు నెల్లూరుజాతి
కొమ్ముల జెనకు టేకోశమందున లేని
కులవిభూషణము నాగూరుజాతి
కోడెత్రాఁచటు బుసగొట్టు రోసముపుట్ట
మైసూరు దరి యమృతమహాలుజాతి
తే. గీ. గోవుమాణిక్యముల మాతృదైవతముల
స్వర్ణవాహినితో శతాబ్దములవారి
నంపుచుంటిమి యెటకొ ఖండాంతరముల
కకట యెట్టిదరిద్రనారాయణులమొ!

సీ. ఆంధ్రరాష్ట్రపునైజ మహాహా పయిలుమాను
తమిళచందము తానతందనాన
పంజాబుమోళా ఖబడ్డార్ ఖడేరావు
బంగాళముది డీలుబంటుహానుమ
సంయుక్తవిషయ మైసాయొ వైసాయో మ
హారాష్ట్రసందర్భ మమియొ తుమియొ
గుజరాతుమాల్లీతు గురువెసాఖాద్బ్రహ్మ
సఁహద్దుమతలబీ శతమతంబు

* * * *

సీ. లాయరైనను మనలాగుమనుష్యుఁడే
మునస బెక్కడి మహామునియొ కాఁడు
వీపున జెడ్జికి వింజామరయు లేదు
కను కలెక్టరు కలికాల లేదు
బొడ్డున మాణిక్యమును బెట్టుకొని పుట్ట
రెచ్చ టెచ్చటి ప్రభు లెవ్వ రేని
నొసటను మూడుకన్నులు పొడ్వ వెండు డి
ప్టేరునకును డిప్టీకేటరునకు
తే. గీ. వేపకాయంతతోకతో విశ్వరక్ష
కంతకును నీరభోగవసంతరాయ
లుద్భవింపఁడు మనవెట్టియూహ కాని
యెవ్వనికి వాఁడె పో పరమేశ్వరుండు!

* *
*

భారతీ ముద్రాక్షరశాల : తెనాలి 1937.

# ఒక ప్రైవేటు

మ. ఎదురుండున్నడువానినైన మఱితానేగాకగత్యంతరం
బెదిలేకుండినవానినైన నొకలాగే యొక్కరోకంటనే
చిదుకంబొడ్చును చేతికిన్ దొరకినన్ జిత్రంబికేమన్న నా
యిది యేరెండవకంటికిన్ దెలియరానీఁడీగ కాలంతయున్.

శా. వ్యూహంబాతఁడు పోషణింపనెదియేన్ హారెత్తి
యేలాటి హే
మాహేమీలునుగూడ మందగుది ధీమాహుమ్మసుల్ సచ్చి త
ద్దాహంబాఱిచిభూరిదక్షిణలతో దాసోహమున్, దాస దా
సోహంబాదురు త్రాహి త్రాహియనిప్రాణాచారముల్ చేయుచున్.

తే. గీ. అతనియూసెత్తినంజాలు నడలెయడలు
హుమ్మరావున కూబకు నొక్కలాగె
యేమిపాలారారాయొయది యంతగ్రామమయ్యె
నెందునను వానిబావుటా కెదురు లేదు.

మ. కుడుముంజేతికినీయఁ బండుగనుచున్ గొండెక్కు
సంతోషమున్
బడులాగుండెడు శుద్ధశ్రోత్రియకుటుంబం బెంతయుద్దండపుం
బిడుగుంగన్నది చూడమంతయుడుకుంబిండం బెటన్ దానిరా
యిడికిన్ వాకిడి కూడ్చిపెట్టుకొనిపోయెన్ గొంపలెన్నేనియున్.

మ. ఎపుడేయొక్కరిలోననొక్కరికెవో యొక్కొల్లుపులంబెట్ట కూ
[illegible]వేపుచ్చుఁదువానిబొందవద యేకో[illegible]సేరదీపంబునా

రుపునాలోచనో లేక కంటికొకకూర్కుందెచ్చుకోలేఁడు నే
లపయిన్ వాఁడెటువంటిదుర్విషపువేళం బడ్డవాఁడో కదే.

మ. పడదీయన్ ముకుత్రాడువోయి నొకదెబ్బన్ రసన్ఁ
జెక్కించు నె
త్తడచున్ గొమ్ములమీఁదఁగొట్టు నెదొకయ్యన్ గ్రోయుఁ
దీయున్ వపన్
దుడుచున్ సర్వముమైల దయ్యాగువలెన్ దోకించుదేకించు నె
య్యెడనేమైనదిగూడఁ దా నెఱుఁగనల్లేచాటు నూరంతటన్.

మ. అవుగానీ! యటువంటియాతనికె బ్రహ్మభేద్యమైపోయి గాం
డివమైయానెనువచ్చికంఠమున కుండెన్ విష్ణుచక్రంబుగా
వ్యవహారంబొకఁ డడ్డమున్ దిరిగి యావ్యాఘాతమంతంతకున్
దెవులే లేనిమహావ్యథం గుడిపె హా త్తేరీ! యటే కావలెన్.

---

## సంజయరాయబారము నుండి

### ధర్మజునకు ధృతరాష్ట్రుని సందేశము

మ. తనకున్ నాయెడభక్తియంచు నొకయంధత్వంబు ప్రాపించినా
జనుపాంధత్వము నేగణింపక కులాచారంబు శాస్త్రంబు నొ
ప్పనిరాజ్యార్హత గట్టిపెట్ట నది సైపన్ రానిదేయయ్యెఁ ద
ప్పని దైపోమెను నాకు సోదరునినిర్బంధంబె ముంచెన్ ననున్.

మ. వెనుకన్ ముందును బాఱఁజూడ కిటుగావింహాగనల్గాచు నె
త్తిని నోర్వట్టుక చెప్పిచెప్పి సువెత్తెన్ నాకుఁ ద నేమొ మం

చినకాలంబును వెళ్ళదీసికొని యోర్మిఁ జేసేతులం దెచ్చి పె
ట్టినరాజ్యార్ధమతయన్నదే యొసరువెట్టఁ గొంప కీనాటికిన్.

మ. విడకద్దాని నెపట్టి యెల్లపుడుతా ౘ్రేలాడుచున్నాఁడు నా
కొడుకా కొమ్ములు దెచ్చి పెట్టినది మీకుఁ దండ్రియుఁ నాకుఁద
మ్ముఁడు నైయుండిన పాండురాజె యను మోమోటంబు చే నైన నే
సడిరాకుండఁ గులంబుగావ మనదే సర్వంబు భారంబికన్.

మ. ఎటులీవిచ్ఛిత్తినర్ధరాజ్యమును నాదే కాదె రాజ్యం బెటో
యటు లే పుణ్యము చేతనో తిరిగిసంప్రాప్తించినన్ మానలి
ప్పటికా మాధ్యము వాడిసూది మొనమోపంబడ్డమాత్రంబె యి
చ్చుట కేనొల్లనటంచు మాటికెదిరించున్ బల్కునీరీతిగన్.

మ. యువరాజై కొడుకుండ రాజనగ నేదో నామమాత్రంబె పౌ
రవపంశీయులయానుపూర్వికచరిత్రంబట్టి యే కాలమం
దెవరున్ రాజ్యము పాలుపంచుకొనినట్లే లేదు తత్పాలనా
వ్యవహారంబాక పెద్దవారలకుటుంబంబందె వర్తించెడిన్.

శా. నీకారీతి నెసంక్రమించినది కానీ గ్రుడ్డివీవాటచే
నీకున్ మారుగ రాజ్యమేలవలసెన్ నీతమ్ముఁడా నేమి నీ
దే కాదే? యధికారమంతయుచు నట్లైకా చో నేను రా
జే కాకుండు నిఁకేల పాండవులకై యే భాగమీయన్ వలెన్.

## ఉపన్యాసకునివర్ణన

సీ. గొంగడిపురుగుకట్టింగు మీసలవాఁడు
గంపశ్రాద్దపుఁదలకట్టువాఁడు
ఎపుడు కాఫీమకాణపు శేవిణీవాఁడు
సిగరుపీలుపు బుగబుగలవాఁడు
పైపటారమును లోపలలొటారము వాఁడు
పట్టుదప్పిన చలోభాయిగాఁడు
తుదమొదల్ లేని గాడిదగత్తెరలవాఁడు
జలసాలతోఁ బడిచచ్చువాఁడు

తే. గీ. తడియనెడిదున్న చోఁజేతఁ దుడుము మొవలు
దేవతార్చనవఱ కొక్కతీరువాఁడు
వలనుపడకున్న శ్రీశుకువంటివాఁడు
తోవదొరకిన వట్టిగంధోళిగాఁడు.

సీ. బర్నార్డుషానె ధూపమునకుఁ రానీఁడు
ఠాకూరునే పోయిటాకఁజూచు
బాలగంధర్వకే బాణీబతాయించు
నాయనాపిళ్లనే దూయఁబట్టు
పట్టాభినేపట్టిపట్టిచూచుచునుండు
జవహరుతోడనే సవతుదెల్పు
దేవకీబోసునే తెగవెక్కిరించును
శాంతరామునకె సూత్రాలు నేర్పు

తే. గీ. ఎట్టికవి యెట్టిగాయకుండేని యెట్టి
రాజకీయజ్ఞుఁ డెట్టిడెరకరేని
యతని బొటినిపడ హతాహతమెగాని
బ్రతికియీవలఁబడుట స్వప్నమున లేదు.

---

## ఉపన్యాసారంభము

సీ. స్టాలిన్‌కు సోషలిజం బేనె నేర్పితి
ముసులోనీ నామాట కసిదొలఁగడు
హిట్లరు ప్రతిది నాయెఱుకమీఁద నెచేయు
రూజువెల్టునకు నాతోజె తోజు
ప్రతిరాజు నేనన్నఁబడిచచ్చిపోవును
ప్రతినియంతయు నన్నుఁబట్టి నడచు
ఏషియాయెల్ల కామూషె నేనెదియన్న
యూరపేసున్న నేహుష్షటన్న

తే. గీ. అమెరికన్ను గృహంబులయందెయుండి
యొక్కస్టీమర్లనే సముద్రోదకముల
నడపెదరుగాని నేనుమీకడనెయుండి
నడపెదఁ బ్రపంచమెల్ల నానావిధముల

సీ. లండనుసర్వముఁ నిండుజనాభాను
ప్యారీసుసర్వముఁ భోరుకొనును
న్యూయార్కుసర్వ ముబ్బూతిలేయూతలు
బెర్లినుసర్వముఁ బొర్లపడును

రోముసర్వంబును రోదపుట్టిపోవును
టోకియో సర్వము౯ మోకరించు
ఎల్లదొరల్ హిప్పుహిప్పుహుఃరేహు రేల్
దొరసాను లోక్కటే విఱుగఁబడుట

తే. గీ. ఇచటియీలోడి తెందు కాలిడినఁజాలు
నూరిపునకంతటికిని బ్రహ్మోత్సవంబె
యేషియాకైసనంతియే యుండియాయె
అంచునీప్రాంతమే యథమాథమంబు.

నా యభ్యుదయాభిలాషులగు నీక్రింది సుగృహీతనాము
నే నిరంతరమును కృతజ్ఞుఁడను.

శ్రీయుతులు

వేదాంతం లక్ష్మీనారాయణ పంతులుగారు.
మాధవపెద్ది కాళిదాసు పంతులుగారు.
కొత్త వెంకయ్యచౌదరిగారు
మరూరి లక్ష్మీనరసప్పగారు.
పుతుంబాక నరసయ్యగారు.
,, సీతారామయ్యగారు.
,, శ్రీకృష్ణయ్యగారు.
,, శ్రీరాములుగారు.
గుమ్మడి వెంకటప్పయ్యగారు.

మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి